# ALANKARACHANDRODAYAM

OR

## *SREE MAKHAVRAJA CHARITRA*

BY

IMMANENI SARABHALINGAM NAIDU.

PUBLISHED BY

IMMANENI VEERESALINGAM,

*THE POET'S SON.*

1st EDITION 1000 COPIES.

PRINTED AT

SRI BHYRAVA MACHINE PRESS,

MASULIPATAM.





1906.

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః

శ్రీ మఖధ్వజ చరిత్రము అను నామాంతరముగల

# అలంకారచంద్రోదయము.

ఇయ్యది

శ్రీమదమ్మంనేని శరభలింగ కవివరునిచే

రచియింపఁబడి

శతావధానులగు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారిచే

పరిష్కరింపఁబడి

ప్రకృతకవివరుని పుత్రుఁడగు

వీరేశలింగముచే

శ్రీ భైరవ ముద్రాలయమున

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 1000 కాపీలు.

దీని వెల రు 0-6-0



1906.

# ఉపోద్ఘాతము.

ఈగ్రంథము ఇమ్మానేని శరభలింగకవివరుఁడు తనకు సుమారు ముప్పది సంవత్సరముల వయస్సున (అనఁగా నిప్పటికి ముప్పదియాఱు సంవత్సరముల క్రిందట) రచియించెను. ఈయన పూర్వులందఱును మంచిమంచి యుద్యోగములుచేసి యశముసార్జించినవారు. ఇప్పటికిని ఈయన వంశపువారు సబ్ జడ్జీ యుద్యోగము మొదలైన గౌరవపదవులనందియున్నవారు. ఈయనయు నుద్యోగమునలననే కుటుంబపోషణము నొనర్చికొనియెను. ఇయ్యనఘుఁడు చతుర్థులలో నొకశాఖయై వన్నెకెక్కిన (ఆది) వెలమకొలమునఁబొడమినవాఁడు. ఈయన నిమిత్తమాత్ర శూద్రజన్ముఁడని వర్తనమే విశదీకరించును. చిన్నతనమునుండియు విద్యాసక్తిమైఁ బాటుపడితుదకుఁగాశికిం జని యచట సంస్కృతభాషఁ జక్కఁగా నభ్యసించుటట్లుండ యోగశాస్త్రమున మిగులఁ గృషిచేసి యయ్యది యనుభవమ్మునకుం గూడ దెచ్చికొని తరించిన యీసత్తము నెవ్వరేనియుఁ బ్రశంసింపక తప్పదు. ఇతఁడు సంస్కృతాంధ్రములలో నిరాఘాటమైన కవితాధారకలవాఁడనుటకుఁగబ్బమేసాక్షి. కల్పనావిషయములోఁదఱుచునితరకవులననుసరించెను. అందులో మను వసుచరిత్రములయందెక్కుడాదరమని తత్తదనుసరణమునుబట్టి యూహింప నయ్యెడిని. అనేకులాకృతిరత్నముల నాధారముగాఁ జేసికొనినవారలు కలరు. వారును మఱియొకరి కృతుల ననుసరించినవారేకదా? ఇట్లనాదిగాఁగవులందఱికిని బూర్వులయనుసరణమున్నదియె. అందుచేతనే కవికర్ణరసాయనమున "చం॥ హృదయగతిఁ బురాతనకవీశ్వరులేగనివీధిలేదునేఁ। దదనుగతిఁ రచించు కృతితాత్త్వికులఁ గరగించకుండునే।మదగజరాజముల్ చనినమార్గమునఁ గదునింపునింపవే। మదగజరాజయానమదమంథరబంధురయానమానముల్॥" అనిచెప్పియున్నాఁడు. ఇక్కవి ప్రయోగవిషయమునఁ గవిత్రయేతరులఁగూడ మన్నించెనని నిరుపాధిక నణప్రాస మొదలగుకొన్ని ప్రయోగములు సూచించుచున్నవి. లేఖనప్రమాదములుతప్ప నీపుస్తకమునఁదప్పులులేవు. ఇయ్యనఘుఁడు బ్రాహ్మణద్వేషములేకయుండుటట్లుండఁ బైపెచ్చువారలయందపారభక్తిగలవాఁడనుటకుఁ బీఠికలోని ౧౦వసీసపద్యమును ఆశ్వాసాంతగద్యములును నిదర్శనములు. ఈగ్రంథమును బ్రకృతకవివరుని ప్రథమపుత్రుఁడగు వీరేశలింగముగారు నాకుఁజూపిరి. నేనామూలాగ్రముగఁ జూచిసంతసించి ముద్రణమునకై పురికొల్పితిని. ఈకవియిప్పటికి 3 సంవత్సరములకుపూర్వము(అనగా క్రీ॥ శ॥ 1903 సం॥మేనెల 23 వ తేదీ వఱకును) జీవించియున్నవాఁడు. ఇందెక్కడనేని లోపములున్నచో సంస్కర్తవిగానూహించి మన్నింప విద్వద్వర్యులు ప్రార్థింపఁబడుచున్నారు.

**11-12-06.**
మచిలీపట్నము.

ఇట్లు శతావధాని,
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

# శుద్ధపత్రిక,

| పే | ప | త | ఒ |
|---|---|---|---|
| 1 | 8 | జ్వల | జ్జ్వల |
| 1 | 14 | చలుఁగన్ | చలుగన్ |
| 3 | 16 | కాశీ | ఁగాశి |
| 3 | 28 | ముఖులంస్తో | ముఖులన్ స్తో |
| 8 | 27 | రజిత | రజత |
| 9 | 5 | గరుడుని | గరుడారి |
| 9 | 26 | పురి | పుర |
| 10 | 1 | గానాయొనర్పం | గానొనర్పం |
| 10 | 1 | నలంకార | యలంకార |
| 10 | 17 | తే॥ గీ॥ | ఆ॥ వె॥ |
| 11 | 9 | పసపాడిగ | పసపాడిఁగ |
| 11 | 13 | జిలుగు | జిలుఁగు |
| 13 | 23 | భావుడగు | భావుఁడగు |
| 13 | 25 | ఝూడై | ఝూఁడై |
| 15 | 1 | బలుకు | పలుకు |
| 15 | 7 | గ్రొమ్మెఱుం | ఁగ్రొమ్మెఱుం |
| 16 | 10 | చుబరి | చుఁబరి |
| 16 | 17 | బొదల।బొదల | బొదలఁ।బొపల |
| 16 | 20 | నిలుడ | నిలుఁడ |
| 17 | 10 | దెలసి | దెలిసి |
| 21 | 4 | నిర్వఘ్న | నిర్విఘ్న |
| 22 | 10 | పొందపొంద | పొందఁబొంద |
| 22 | 27 | భ్రామ్యత్సుకా | భ్రామ్యచ్ఛుకా |
| 23 | 19 | ధరణీశుడ | ధరణీశుఁడ |
| 25 | 2 | గదసెన్ | కదిసెన్ |
| 25 | 3 | కదసి | కదిసి |
| 25 | 7 | ప్రఫుల్లా | బ్రఫుల్లా |
| 27 | 24 | కనుల | గనుల |
| 28 | 2 | మరుం | మఱుం |
| 29 | 24 | మందరు | మందఱు |
| 30 | 2 | శమగం | ఁగమఠం |
| 31 | 12 | గంధపలి | గంధఫలి |
| 33 | 5 | అట్ల...నెడ | అంత |
| 35 | 15 | ప్రోడయై | ఁబ్రోడయై |
| 36 | 1 | కదసి | కదిసి |
| 36 | 26 | దుందుస్వర | దర్ధిస్వర |
| 37 | 23 | సూవె | ఁజూవె |
| 38 | 19 | దీప్య | దీవ్య |
| 39 | 1 | స్ఫుర | స్స్ఫుర |
| 39 | 15 | పున | ఁబున |
| 42 | 26 | సౌహార్ద్ర | సౌహార్ద |
| 48 | 1 | జూచు।పలుక | జూచుఁ।బలుక |
| 48 | 1 | చిలుక | ఁజిలుక |
| 49 | 5 | నూరు | నూఱు |
| 49 | 11 | వెలుఁగులచె | వెలుఁగులచే |
| 49 | 11 | దొలిగి | దొలఁగి |
| 50 | 7 | నులియ। | నులియఁ। |
| 50 | 8 | చివురు | జివురు |
| 51 | 7 | మల్లనె | మల్లగె |
| 51 | 8 | గ్రోలి | గ్రోవి |
| 52 | 15 | మఱలి | మరలి |
| 52 | 20 | గొల్తమిక | గొల్తమిఁక |
| 53 | 18 | శౌరాగ్ని | శౌర్యాగ్ని |
| 55 | 11 | లబదరి | లఁబదరి |
| 56 | 16 | భవుడు | భవుఁడు |
| 57 | 3 | నిడియించి | విడియించి |
| 57 | 12 | రందరు | రందఱు |
| 57 | 29 | నాగృక | నాఁగృక |
| 59 | 9 | దెల్పగ | దెల్పఁగ |
| 61 | 15 | బొల్పుతో | పొల్పుతో |
| 61 | 17 | తేత | తేఁత |
| 1 | 25 | చోదమి | చోఁదమి |
| 61 | 28 | నిల్చె | నిల్చి |
| 62 | 14 | వేదంద | వేదండ |
| 62 | 17 | మరీచిసద్రీచీ, సద్రుచిరంబై | మరీచిరుచిరంబై |

# AUTHOR'S BRIEF AUTOBIOGRAPHY.

ఉ॥ హూణశకంబునందు శశియుక్ బయి దిగ్గజ సింధుయామినీ।
శానుల నిల్వ నెన్నఁదగు సంఖ్యగలట్టి * సమంబునం దిమా।
నేని కులంబునందున జనించితి మామక చర్యసంగ్రహం।
బాని వచించువాఁడ శరభాఖ్యుఁడఁ గానఁగదే పరాత్పరా॥

ఉత్పలమాలిక.

పావనమైన యావెలమ వంశమునన్ జనియించి కాశికన్।
దేవసమానుఁడైన గురునిన్ గని సంస్కృతభాష శాస్త్రముల్।
శ్రీవెలయంగఁ దచ్చరణచింతనఁ జేయుచు నెప్పుడింటిపై।
భావముఁ జొన్పకాస్థమెయిఁబాసము సేయుచు యోగివర్యులన్।
సేవయొనర్చుచుండ ననుఁ జిన్నటనాఁటనె వీడియుంటఁగ।
న్గో వివిధప్రదేశములకున్ గబురంపుచునున్న బందుగుల్।
తావరమున్ దుదిన్ దెలసి దానినిజంబు నెఱుంగఁ గొందరన్।
ద్రోవకు సాయముంగాని ననుంగన మామక పత్నితోడఁగా।
శ్రీవరపత్తనమ్మునకుఁ జెచ్చెరఁ జేరి గురున్ స్వదేశమున్।
బోవఁగఁ జెప్పి పంపుఁడని పొక్కుచుఁ బ్రార్థనసేయ భార్యని।
ట్లీవిధి వీడియుంట తగునేయని నాకువచించియింటికిన్।
బోవఁగఁ జేసె నంత పరమున్ గురువర్యుని వీడలేక యొ।
క్కేవిడి కొంతకాలమున కింటికివచ్చితి నంత పాపపుం।
దోషివకుఁ దార్చు సంసృతినిఁదోగి తదర్థమొకింత హూణవి।
ద్యావిధి సంతరించి జఠరానలమార్చుచు సర్వదా మహా।
దేవ! త్వదంకితంబులుగఁ దెల్గున సంస్కృతభాషఁ గబ్బము।
ల్కేవల మోక్షకాంక్షమెయి లీలరచించుచు యోగశాస్త్రపుం।
త్రోవల నభ్యసించుచు జనుఃఫలముల్ గనినాఁడ నింతకుం।
దైవమ! నన్నిఁకేవిధమునన్ గడతేర్చఁగనున్నవాఁడవో॥

* క్రీ॥ శ॥ 1841 సం॥

సీ॥ తిరిగినాఁడను బుణ్యతీర్థమ్ములందుఁ బ్రాజ్ఞతగల్గినట్టి పండితులతోడ।
రచియించినాఁడ మేల్గ్రంథమ్ములను బండితులు మెచ్చునట్లు పేర్మిలుచుకొరకు।
ధర్మార్థకామముల్ దనివితీరఁగఁ గంటిఁ గొమరులఁ గాంచితిఁ గులమునిలుపఁ।
బదిమందియును మంచివాఁ డీతఁడనమరి యూదగాఁ గాలమ్ము నపనయించి।
గీ॥ తినినిఁ కొల్లైన లోపమేదియును లేదు। వార్ధకంబచ్చె దేహమస్వస్థమయ్యెఁ।
గలుగఁ జేయుము నాకిప్డు గరుణతోడ। మోక్షమని యెడు పురుషార్థమును మహాత్మ॥

---

ఈపైపద్యములు శ్రీమాతండ్రిగారు క్రీ॥ శ॥ 1903 సం॥ మే నెల 23 వ తేదీ సాయంత్రమిఁక నొకజామునకుఁ గైవల్యప్రాప్తులగుదురనఁగా రచించిరి. వీనిలో వారివర్తనము సంగ్రహముగా నుడువఁబడి యున్నది. ఈ అలంకారచంద్రోదయము గాక వారిచే దీనిపీఠికలోని 29వ వచనములో నుదహరింపఁబడిన 1 సంపన్నరాజయోగము, 2 శివగీతశశికళ, 3 గీతగౌరీశము, 4 చిత్రకేతూపాఖ్యానము, 5 ముముక్షుజనాహ్లాదము, 6 కవిజనహృద్యము, 7 లక్షణప్రకాశిని, 8 భవరోగభిషగ్వరము, 9 మోక్షకామినీస్వయంవరములను సంస్కృతాంధ్ర గ్రంథములు కలవు. కానియిందు నాలవదియగు చిత్రకేతూపాఖ్యానము వారు బాపట్లతాలూకాకచ్చేరిలో పనిచేయుచుఁ గారణాంతరముచే మఱియొక గ్రామములో నివసించియుండునపుడు శిథిలమైపోయినది. తిరిగి వారు దానిని వ్రాయుట కెందుచేతనో పూనుకొనలేదు. ఇదితప్ప తక్కిన పుస్తకములను గ్రమముగా ముద్రింపించుచున్నాఁడను.

20-12-06.
మచిలీపట్నము.

ఇట్లు విధేయుఁడు
ఇమ్మానేని వీరేశలింగం.



శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

శ్రీ మఖవ్రజ చరిత్రంబను నామాంతరము గల

# అలంకారచంద్రోదయము.

## ప్రథమాశ్వాసము.

శా॥ శ్రీమించంగ నశేషలోకములు సృష్టింపన్ దగన్ ధాతయై।
ప్రేమన్ బాలనసేయఁ గేశవుఁడునై విశ్వప్రణాశక్రియన్।
భీమాకారముఁ దాల్చి సర్వమును సంప్రీతిన్ వెసన్ దానెయౌ।
స్వామిన్ మోక్షమయున్ మహామహిము భాస్వత్సంవిదున్ గొల్చెదన్॥ ౧॥

మ॥ వెలువారన్ జిరభూతులిచ్చుటకునై శ్రీమానినీరత్నమై।
తెలియన్ విద్యలకెల్లనున్కియగు వాగ్దేవీజగన్మాతయై।
యిలధీవృత్తికి శక్తియౌ గిరిజయై యింపొంద సర్వంబును।
జ్వాలమాలంబునుఁ దానెయౌ ప్రకృతిశశ్వత్ప్రిక్రియన్ గొల్చెదన్॥ ౨॥

చ॥ ఒకవెలిఁ జేర్మిమైనొడలనొక్కచెలిన్ జడలందరించియుం।
దొకసతిఁ గన్మొఱంగి మతియొక్కతెమక్కువతోడఁ గూడుచుం।
టకుమకుటీకృతాహిపఫణాచ్ఛట పెందరచీరగానవం।
గుకలనఁ దేలుఁ శంభుఁడొసఁగున్ బరమేప్సితతత్త్వశీలమున్॥ ౩॥

శా॥ శ్రీలోలాక్షి వసుంధరారమణి గా శ్రీవత్సమూహించియౌ।
నాలేయంచలుఁగన్ ద్వదీయకుచయుగ్మాంచన్మృగీనాభికా।
శ్రీలక్ష్మంబిడిజూచితే యనుచు లక్ష్మిన్ గాఁగిఁటన్ జేర్చుసం।
శీలాత్ముండగు విష్ణుదేవుని మదిన్ సేవించి భావించెదన్॥ ౪॥

మ॥ అతులాంగద్యుతికోమలాతపముగా నాత్మీయపీతాంబుజాం।
చితమాకర్ణికపూర్వపర్వతలసచ్ఛృంగంబుగాఁ బద్మినీ।
సతితోఁ బొల్పగు బాలసూర్యుఁడన భాషాయుక్తుఁడై యొప్పన।
చ్చతురాస్యుం డఖిలైకవాంఛితములన్ సంధానమున్ జేయుతన్॥ ౫।

చ॥ చెలువుఁడు నామరూపములచే శివుఁడౌటనుఁ దాను సర్వమం।
గళయగుచున్ బ్రియానుగుణగా వునఁ దద్వపురైక్యమూనిత।
ద్గళమున నున్న చేదుదొలఁగన్ దనచక్కెరమోవి పానకం।
బులఁ దనియించు శైలసుత బ్రోచుత నన్ను నిరంతరంబుగన్॥ ౬॥

చ॥ మనసిజుఁ గన్నతల్లి వరమానిజనావళికల్పవల్లి మే।
ల్గానములపాలవెల్లి సదకుంఠయశోజితమల్లి యిందిరా।
వనజముఖీమతల్లి శుభవైఖరులన్ విలసిల్లి సంతతం।
బును ఘనమోక్షలక్ష్మివలెఁ బొంగి వసించు మదాత్మ నెప్పుడున్॥ ౭॥

చ॥ కరయుగకంకణధ్వనులు కల్పితతాళరవంబులై తగన్।
సురుచిరకణ్ఠదేశసుమశోభితబంభరనాదముల్ శ్రుతి।
స్వరములఁ బోలఁ బాండుతరపద్మమునందు వసించి వీణసుం।
దరముగ మీటు వాణి శుభదాయిని భారతి నెంతు నాత్మలోన్॥ ౮॥

సీ॥ ఘనకటస్థలగళత్కలితదానజలాళ జరియించు బంభరషండవిదిత।
కాకలీనాదంబు కర్ణోత్సవముగాఁగఁ బాటకైవడి మించి ప్రబలుచుండఁ।
దనరు మొక్కెడి భక్తజనమస్తకోత్కర్షకర్షణ డిండిమోత్కంఠమైన।
ధ్వానంబు తాళనాదంబుకైవడి నొప్పఁ ధీరుఁడై వినువిఘ్నదేవు మఱియు॥
గీ॥ నాగభూషణుఁడయ్యు వినాయకుఁడయి।గరిమ ద్విరదాస్యుఁడయ్యు నేకరదుఁడగుచు।
మహిని వెనకయ్యయయ్యుఁ గుమారపూర్వ।జన్ముఁడగు లంబగర్భుని సంస్మరింతు॥ ౯॥

మ॥ వటవృక్షోత్కటమూలవాసు మునిహృద్వ్యాప్త్యేకబోధాకరుం।
బటుచిన్ముద్రధరున్ బరాత్పరు మహాప్రఖ్యాతశీలున్ శివున్।
నిటలాక్షున్ సుభగప్రచారుఁడగు వానిన్ దక్షిణామూర్తి వి।
స్ఫుటమన్మానసవీధిఁ గొల్తు సతతంబు న్వాంఛితంబొప్పఁగన్॥ ౧౦॥

సీ॥ వైకుంఠమునకుశ్రీవాసుదేవుఁడునేత కైలాసమునకుఁదాఘనుఁడుశివుఁడు।
సత్యలోకమునకుజలజసంభవుఁడాఢ్యుఁడమరావతికిభర్త హరిహయుండు।
భూలోకమునకుఁదాభూపతినాథుండుపాతాళమునకహిపతియుమేటి।
గ్రహసంఘములకెల్లగ్రహపతియధిపుండురాత్రులకెల్లరేరాజురాజు॥
తే॥ గీ॥ గానివిప్రులులోకసంతానములకు।నెల్లరకుఁబూజ్యులధికులునిష్టఫలులు।
వరతపోధనులత్యంతనిరతశుచులు।గానభూసురకోటులఘనతఁగొలుతు॥ ౧౧॥

చ॥ పరమగురున్ మహామహిముభాసితతత్త్వవిలోలుసత్పదున్।
వరదునిఋష్యమూకగిరివాసుశివాత్మకయోగధారణున్।
జిరతరచిద్విలాసపరచింతనునిర్విషయున్ నిరంజనున్।
నిరుపమురామజోగియతినిన్ మతిలోనుతియింతువేడ్కతోన్॥ ౧౨॥

శా॥ శ్రీపంచాక్షరిబోధఁజేసిసుమతిన్ జిన్మార్గతత్త్వంబుని।
శ్లేషానందముగాఁజూపినగురున్ శ్రీముల్గువంశోద్భవున్।
పాపోత్పాతవిమోచనున్ వరదుసుబ్రహ్మణ్యసన్నామునిన్।
రూపింపన్ హృదయాంబుజంబునమహారూఢింబ్రశంసించెదన్॥ ౧౩॥

కం॥ ఘనసంస్కృతవిద్యాగురు।గనదాత్మజ్ఞానపూర్ణుఁగరుణోపేతున్।
వినయితననంతరామా।ర్యునికాశీవాసుయతినినొప్పుగఁదలఁతున్॥ ౧౪॥

తే॥ గీ। తెనుఁగువిద్యనుజెప్పినఘనునిఁజదలు।సాకశ్రీవేంకటాచలపతినినతులుఁ।
బరమభూదేవకులజునపారపుణ్యుఁ।గొలుతుగ్రంథాదినాదిమగురునిమదిని॥ ౧౫॥

తే॥ గీ॥ ప్రేమమద్బాల్యమందునఁబ్రియమెలర్పఁ।దారకంబునుదెల్పినధన్యమాన్యుఁ।
బాపినేన్వంశవననిధిభవ్యసోము।నాదినారాయణునిఁగొల్తునమితభక్తి॥ ౧౬॥

చ॥ తనరఁబితృవ్యనందనునుదారునివేంకటరంగనామస।
ద్ఘనునురులక్షణైకవరకావ్యముఁగూర్మినిబాల్యమందునా।
ధనముగబోధఁజేసిమనుధన్యునిమాన్యమహాత్ముశ్రీనిధిన్।
మనమునఁగొల్తుభక్తిసుకుమారునిధారుణిగారవంబుగన్॥ ౧౭॥

శా॥ నీరేజాక్షసమానుఁడైవరతపోనిష్ఠాగరిష్ఠాత్మత।
శ్రీరామాయణకావ్యరూపమునవాణిన్ క్షోణికింబోణిమిం।
పారందెచ్చినవామలూరుతనయున్ వ్యాసున్ మయూరాహ్వయున్।
జోరున్ భారవిఁగాళిదాసముఖులంస్తోత్రంబుఁగావించెదన్॥ ౧౮॥

గీ॥ భారతంబు నాంధ్రభాషగ నొనరించి । వినుతిగనిన సత్కవిత్రయమును ।
పెద్దనార్యసోము భీముని శ్రీనాథు । శంకరాఖ్యమదిని సంస్మరింతు॥ ౧౯॥

తే॥ గీ॥ అజ్ఞులను చుసుఁగు కవులననఁగ నేల । నెవ్వనికి బూర్వకృతఫల మెంతగలుగు ।
నంతవిద్య యొవానికి నబ్బు ధాత్రి । భవుని కన్నను సర్వజ్ఞపతి గలండె॥ ౨౦॥

చ॥ ఘనరసపూరనవ్యపదకల్పితకావ్యము మూర్ఖరాజికి ।
న్మనసు ననింపుఁ జేయునె ? సుమానవకోటికిఁ గాక కామినీ ।
ఘనతరయౌవనాతిశయకాంతివిలాసము బాలుచిత్తము ।
న్ననయము మెచ్చుఁ జేయునె ? రసాత్మునికిన్దగుఁ గాక భూస్థలిన్॥ ౨౧॥

కం॥ అనియిష్టదైవనతి కవి । జననుతియు నొనర్చి రసలసద్బంధురవా ।
గనుబంధ మొకప్రబంధం । బనుసంధింపన్దలంచి యాసమయమునన్॥ ౨౨॥

వ॥ 'ఇట్లు కృతకృత్యుండనై సహచరులగు కతిపయ పండితోత్తములచే నాకలంకారకవిత్వంబుఁ జేయ సమర్థతా విశేషంబు లేదని యప్పుడప్పుడచ్చటచ్చటఁ బ్రశంసావిధంబులు గలిగిన నే నిరంతర మోక్షాపేక్షకుఁడనగుటంజేసి భక్తి జ్ఞాన వైరాగ్య ప్రదర్శనంబగు కవిత్వంబే కవిత్వంబుగాని తదితరంబులు వ్యర్థంబులని మానసంబునందలంచుచు నారేయి నిశీథసమయంబున విజనస్థలంబున నాసీనుండనై చిత్తత్త్వప్రబోధ్యంబగు ప్రజ్ఞానబ్రహ్మవలోకనంబు సేయుచుఁ జిదాకాశమధ్యంబున వెలింగెడి వెలుంగుం జేరి బయలు బయలంగలపి మనోమారుతంబు లనేకంబుఁ గావించి నిశ్చలత్వం బాచరించి కనుచూపుమేర గోచరంబైన హృదయాకాశంబున ధీవిలక్షణుండనై జీవన్ముక్తి సుఖం బనుభవించుచుండ నంతఁ బూర్వరాత్రంబగుటయు నపరరాత్రంబున సుఖనిద్రితుండనై తదాలాపజనితస్వప్నకలితుండనైన మామకమనోదృక్పరోక్షంబున నిట్టిదట్టిదని వర్ణింప నలవిగాని త్రిమూర్త్యాత్మకంబగు నొక్క దివ్యతేజంబు గానంబడియె. నది కేవలశివమయంబై తోఁచె నట్టికేలకే నాతేజంబును మానజపనిర్వృత్తి ధ్యానంబులు గావింప గంగాజటాజూటుండును ద్రినేత్రుండును శశిశేఖరుండును ఖట్వాంగ ఖడ్గ పాశాంకుశ డమరుకత్రిశూల చాప బాణ భిండివాల గదా శక్తి ముసల తోమర భుశుండి ముద్గర పట్టిస పరిఘ శతఘ్ని చక్రాద్యాయుధధరుండును నాగేంద్రహారుండును నాగేంద్రకుండలుండును నాగచర్మాంబరధరుండును వృషభవాహనుండును విషగళుండును బాండురచ్ఛాయామండితుండును భస్మ రుద్రాక్ష దామాలంకారుండును బరమతేజోవిరాజమానుండును యోగపట్టాభిరాముండును నగు శ్రీదక్షిణామూర్తి శివరామజోగి గురువిభుండు తానుత్రి

మూర్త్యాత్మకపరమపురుషుండైనను మదుపాసనా దైవరూపంబున సాక్షాత్కరించినఁ బునఃపునః ప్రణామంబు లాచరించుచు నిట్లనిస్తుతియించితి॥ ౨౩॥

ముక్తపదగ్రస్తము॥ అనేకజన్మానుష్ఠితాకామకర్మోపాసనాసమాసాదితేశ్వర ప్రసాదలబ్ధదర్శనచరణారవింద, అరవిందాసనముఖవినుతశివజీవైక్యనిష్ఠాగరిష్ఠ, గరిష్ఠ ప్రభూయిష్ఠజనాగోచర, గోచరితసకలతత్త్వస్వరూప, స్వరూపసమాలోకితసకలచరాచరసృష్టిస్థితిసంహారతిరోధానానుగ్రహ, అనుగ్రహాపేక్షవిద్వజ్జనమానసాంభోజభ్రమర, భ్రమరగుహాంతర్లక్ష్యమాణ నీలతోయదమధ్యస్థతటిల్లతాభాస్వర సుషుమ్నాంతరావచ్ఛిన్నానావృతచిత్ప్రభాకార, ప్రభాకారనిజచిత్ప్రభావిదారితభక్తజనాజ్ఞానతామస, తామసజనాగోచరచిద్విలాసపరిగృహీతగురుశరీర, శరీరభృచ్చిత్పాకాభివ్యక్తానాహతప్రణవనాదాత్మక, నాదాత్మకానుసంధేయనిష్ఠయోగిజనసులభ, సులభప్రసాద, ప్రసాదితాశేషమంగళామానస, మానసాగ్ర్యాతభవచ్చరణశ్రీసుదిమ్మనేనిశరభలింగానుగ్రహార్థాసాదితశ్రీరామజోగిగురుస్వరూప, దక్షిణామూర్తే, నమస్తే, నమస్తే, నమః॥ ౨౪॥

శ్లో॥ శర్వాయముక్తినిలయాయమహేశ్వరాయ। గౌరీశ్వరాయపరమాయనిరీశ్వరాయ।
సర్వేశ్వరాయవితతాయవిలక్షణాయ। భక్తానుకల్పతరవేగురవేనమస్తే॥ ౨౫॥

గణాగోచరసమగీతిసంయుతసర్వలఘుసీసము.

పరవరపురహరగరధరసుఖకరమురహరశరశివపరమపురుష।
సురుచిరమృగధరనరసురవరఖరహరనిజజనదరహరణసతత।
గుణగణకవిమునిజనజినపశుపతి, స్మరహరగజముఖజనకగిరిశ।
ఘనభవభయహరధనపతిసఖభవ, స్థిరతరవరపుర, యురగధరణ॥

తే॥ గీ॥ సకలజగదవనవరణసమరసహృద।యకరిదనుజహరణక్షణ, నికరకరణ।
శశిధరణవరదవిశదశమదమముఖ।విమలసుగుణసముదయయుతమఘహరణ॥ ౨౬॥

మాణవకవృత్తము॥ ఏణధరామోక్షకరా।ప్రాణపదామారహరా।
బాణసుపర్వారినుతా।శోణజటాజూటయుతా॥ ౨౭॥

సీ॥ బ్రహ్మాండములమించిభస్మంబునొనరించిగరళంబుభూమికిఁగదిసినపుడు।
లోకజాలంబులుచీకాకునొందంగఁద్రిపురరాక్షసులువర్తించినపుడు।
సకలబృందారకుల్ సంక్షోభమందంగనలజలంధరుఁడిలవెలసినపుడు।
నిఖిలఘాతంబులనిర్మూలముగఁజేయుప్రళయమూర్వికిఁబర్విప్రబలినపుడు॥

తే॥ గీ॥ ధీరుఁడై ద్రావె నెవ్వఁ డపారమహిమ। నాశ మొనరించె నెవ్వఁడు నవ్వుతోడ।
గాలిచె నెవ్వఁడు నిత్యుఁడై నిలిచె నెవ్వఁ। డట్టి సర్వేశుని నుఁ గొల్తు నఘవినాశ॥ ౨౮॥

వ॥ అని యివ్విధంబున స్తుతియించిన నాయందంతఃకరుణావిశేషంబు చేఁ దనభక్తపరాధీనత్వంబు ప్రకటంబు నొందనిజాకారంబుగ లింగదేహంబున హృదయలోచనగోచరుండైనిరామయ బ్రహ్మజ్ఞానాంశానాహతంబునందుద్భవించి హృదయాకాశంబున కెక్కి బ్రహ్మాండంబు భేదించుచుఁ బ్రణవాకారనాదంబు నదిశలు పిక్కటిల్లనిట్లనియె, నీవు నియ్యాద్వైతవిజ్ఞానవీక్షణంబుచే నెల్లసమయంబులను నుదృష్టించుచు జీవన్ముక్తిసుఖంబనుభవించుచునుండఁ బ్రారబ్ధలబ్ధావసానసమయంబున ఘటాకాశంబు మహాకాశంబునందు మిళితంబైనచందంబున నందంబుగ నాయందు విదేహకైవల్యంబు నొందెదు సందియంబింతయు కైన లేదిప్పుడు నీవు వేటపాళెంబను పురంబున నుండుటం జేసి యేతత్పురాధినాథుండనగు మదంకితంబుగ మార్కండేయపురాణోక్తంబైన శ్రీమన్నారాయణాంశసంభవుండగు మఖబ్రహ్మజుని చరిత్రంబు నలంకారచంద్రోదయంబను నామాంకితంబుగఁ బ్రబంధంబొనర్పుము మున్ను నీవు సంస్కృతంబున సంపన్న రాజయోగంబను యోగశాస్త్రంబును, శివగీతశశికళయను గానకావ్యంబును, గీతగౌరీశంబను యక్షగానవినోదాష్టపదియును, నాంధ్రంబునఁ జిత్రకేతూపాఖ్యానంబను పురాణరత్నాకరంబును, ముముక్షుజనాహ్లాదంబను వేదాంతశాస్త్రంబును, కవిజనహృద్యంబను బంధకవితాప్రబంధంబును, లక్షణప్రకాశిని యను ఛందోవిషయవాక్యగ్రంథంబును, గేవలబాల్యంబున భవరోగభిషగ్వరంబను వచనకావ్యంబును, మోక్షకామినీస్వయంవరంబను నాటకంబును, రచించితివి వానిని నేఁ బరమాదరణంబునఁ గైకొంటి నిప్పుడిదియును విష్ణులీలాభివర్ణనంబు గావున॥ ౨౯॥

కం॥ సంతానసప్తకములోఁ। జింతితఫలదమయి కీర్తిఁ జెలఁగి జగద్వి।
శ్రాంతమగుఁ గానఁ గూర్పుమ। నంతచమత్కృతిగఁ గృతి మదంకితనియతిన్॥ 30॥

వ॥ అని యివ్విధంబున సెలవొసంగి క్షణమాత్రంబున కఖిలైక్యంబగు స్వపదంబు నొందిన గొంతతడవునకే నా నిద్రాసమాధియందు మేల్కని మదభీష్టార్థంబు సిద్ధించెనని పరమానందకందళితహృదయారవిందుండనై మొదల మద్వంశప్రకారంబభివర్ణించెద॥ 3౧

సీ॥ కల్పాదివిష్ణుండు సునపయోనిధిశేషతల్పశయనుఁడైనతఁడని హరికి।
నాభీకమలమందున లువబుట్టఁగనతని వెనుక నుదయించిరి వరమతులు।
భద్రపద్మలు నాగభద్రయశులు వారి వంశంబునందున వరుసఁ బుట్టె।
నాదెనపద్మనాఖ్యాదులు వీరిలోఁ బ్రథమపుత్రుని కులప్రభవమైన।
గురుతరపువ్వాడగోత్రంబునందునఁ బరమేమ్మనేన్వంశ వరుఁడు నమిత॥

తే॥ గీ॥ దానగుణభాసితుండు సన్మాననీయ। వైభవోల్లాసశుభకరవర్తనుండు।
గోనసార్యుండు శివభక్తిగురుఁడనంగ। యశమునొందెను జగమందు విశదముగను॥ ౩౨॥

చ॥ అతనికిఁ బాపనాహ్వయమహామహిముండు నుదారసత్యవా।
గ్వ్రతపవనాత్మజాగ్రజుఁడవార్యసముద్భవశౌర్యసూర్యపం।
హృతకితవాహితప్రతతిహృత్కుహరాంచదఖర్వగర్వగా।
ఢతమతమస్సమాజుఁడు దృఢప్రతిభుండు జనించె ధీరుఁడై॥ ౩౩॥

ఉ॥ శ్రీకరుఁడిమ్మనేనికులశేఖరుఁడుం సుగుణాన్వితుండును।
శ్లోకుఁడశేషదీనజనసుస్థిరపాలనదక్షుఁడార్యపూ।
జాకరుఁడీశ్వరార్చనలసన్మతిశాశ్వతభక్తియుక్తుఁడి।
చ్ఛాకనదిందిరాలయుఁడు శాంతిఘనుండగు బాపనయ్యకుం॥ ౩౪॥

శా॥ శ్రీవీరేశ్వరలింగసత్పురుషుఁడుం శ్రీయాదినారాయణా।
ఖ్యావిర్భావుఁడుఁ గోటిలింగపతియుం హర్షాత్మలీమారుతే।
జోవంతుల్సుగుణాన్వితుల్వితరణాస్తోకప్రసిద్ధుల్సుతుల్।
శ్రీవింగల్గిరిసాధుచిత్తకవిగోష్ఠీప్రీతచేతస్కులై॥ ౩౫॥

వ॥ వెండియు వారెట్టివారనన నందుఁ బ్రథమపుత్రుండు॥ ౩౬॥

సీ॥ భవునివైఖరి పద్మభవునివైఖరి భవ్యభూతిచే శేముషీభాతిచేత।
చంద్రుకైవడి హరిశ్చంద్రుకైవడి కళాయుక్తిచే వరసత్యసూక్తిచేత।
నింద్రుపోలిక భూధరేంద్రుపోలిక భోగపూర్తిచే ధైర్యవిస్ఫూర్తిచేత।
మిత్రుచాడ్పునఁ జైత్రమిత్రుచాడ్పున భూరిదీప్తిచే లలితరూపాప్తిచేత॥
తే॥ గీ॥ నలరి పొగడొందె నిజహృదయారవింద। కందళితభక్తినందితనందివాహ।
నందనుఁడు భూసురారాధనప్రియుండు। నమరవీరేశలింగాఖ్యుఁ డవనియందు॥ ౩౭॥

వ॥ ద్వితీయనందనుండు॥ ౩౮॥

సీ॥ శారదాభ్రశతారతారకాశరకాండకాండజాసనకాండఘనయశుండు।
రమణీయనలరాజరాజరాజకుమారమారసన్నిభసుకుమారమూర్తి॥
రమ్యచింతారత్నరత్నాకరభమిత్రమిత్రజద్యోద్రుమామితవితీర్ణి।
జ్వలితదావజ్వాలజాలాంబురుహబంధుబంధుప్రతాపశోభావిభాసి॥
తే॥ గీ॥ జగతిఁ బొగడొందెనగణితసుగుణభగణ। సదృశహీరలలాటికాసంపరిష్కృ।
తాఖిలాశాంగనాలలాటాళిబుధవి। ధేయసుభగుండు నాదినారాయణుండు॥ ౩౯॥

వ॥ తృతీయాత్మజుండు॥ ౪౦॥

సీ॥ తనదానమహిమసంతతమర్థిజనపుత్రపౌత్రాన్వయావనప్రౌఢి నెసఁగఁ।
దనచేతిహేతిదృప్తవిపక్షవక్షఃకవాటపాటనపాటవంబు నెఱపఁ।
దనధైర్యగరిమమందరధరాధరవరస్థిరవిస్ఫురణతోడఁ జెలిమి సేయఁ।
దనవాగ్విలాసంబు సుధారసఝరీపృథుమాధురీసాధురీతి నెసఁగ॥

గీ॥ దనవిమలసన్నిధానంబు తతమనీషి। జనమునకు సన్నిధానమై మనఁగ సకల।
తీర్థయాత్రాపరిష్కృతదేహయష్టి। కోటిలింగాఖ్యుఁడుజ్జ్వలగుణవరుండు॥ ౪౧॥

ఆ॥ గీ॥ అందుఁ బ్రథమపుత్రుఁడైనట్టివీరేశ। లింగమహితయశునిరంగదమల।
భక్తిపరునిదానభాస్వరువరలీల। లెన్నఁదరమె భువి నెవరికైన॥ ౪౨॥

వ॥ అదియెట్లన్న॥ ౪౩॥

ఉ॥ తత్త్రితయంబునందమితధార్మికతావిభవప్రసిద్ధచా।
రిత్రుఁడు వీరయాఖ్యుఁడలశ్రీనిధులాదియకోటయాహ్వయుల్।
పాత్రతఁ దమ్ములై తనద్విబాహువులున్న లెఁ బేర్మిమై మనన్।
ధాత్రినిఁ గీర్తిఁ బొందెశుభదస్థితిసర్వదిగీశవేద్యుఁడై॥ ౪౪॥

వ॥ మఱియు నవ్వీరేశలింగమనాయకుండు, సదవనాస్పదదయారసహృదయుండును, సుమహితసమస్తార్థిజనకుముదప్రమదకరసకలకకుబంతరనిరంతరవిశ్రాంతవిశ్రాణనహిమకరోదయసముజ్జృంభితశుంభద్యశఃకలశార్ణవనటద్విశాలసుగుణకల్లోలవిలంఘితావధికుధరరోధఃప్రఘాణుండును, తనూధృతవినూతనకనత్కనకదుకూలాంచలావధీరితచంచలావితానుండును, త్రిపురభేదనభేదనోద్యమసముద్యత్కోపాటోపమహాకాలఫాలానలాభీలజ్వాలామాలికోపమప్రతాపతపనదారితసమదారిప్రమదాకుచలికుచనిచితచకచకద్రుచిరముక్తాహారతారకావారకచనిచయరుచితిమిరవదనవిధుస్మితచంద్రికావిలాసుండును, నిఖిలాశ్రితజనవనవసంతాయమానానూనదానలక్ష్మీనివాసుండును నగు నాసద్గుణభాసురుండద్దంకి, కోటదేవరాయపల్లి, గూడూరు, సంగంబు, మొదలుగాఁగల నేకపురవరంబులఁ దహశీలుదారునామకోద్యోగంబుఁ జేసి, యధికసుకృతవంతుండును, దిగంతరాక్రాంతయశఃపరిపూరితుండును నైవర్తిలె నెట్లన్న॥ ౪౫॥

సీ॥ తతదివ్యచంద్రికాధవళాంశుకముఁగట్టి గగనగంగాకంచుకంబుఁ దొడిగి।
హిమశైలరజితశైలములను పాలిండ్లపైఁ దారకాహారపటలి మెఱయ।
నమరశాఖిసుమాళియవతంసముగఁ గ్రాలవీణాశ్రుతినినల్వరాణివాడఁ।
గలశాంబునిధితరంగమృదంగనిస్వనంబలర మహానటుండాటఁగఱప॥

తే॥ గీ॥ ఘనశరద్ఘనమనుతిరస్కరణమించి।చంద్రవదనంబుదోఁపలాస్యంబొనర్చుఁ।
బరగవీరేశలింగధీవరునికీర్తి।కాంతబ్రహ్మాండభవనరంగంబునందు॥ ౪౬॥

సీ॥ ఉరమందుఁబూనకచరమాంగమునఁబూనుకమఠనాథునిఁ బొందుఁగనఁగనేల।
యురుమదోన్మత్తతఁబఱగిమేనెఱుఁగనిదిగ్గజంబుల పొందుదివురుచేల।
కుటిలభుజంగుఁడైచటులవృత్తిఁజరించుగరుడునితోడసఖ్యంబదేల।
గ్రావపూరితమయికడుజడత్వంబునఁగదలనిగిరులసాంగత్యమేల।
తే॥ గీ॥ యనుచుఁగూర్మహరిద్విరదాహినాథ।పర్వతంబులకూటముల్ వరుసవిడిచి।
సరసవీరేశలింగధీవరుని భుజము।నందువసియించెసుఖముగనవనికాంత॥ ౪౭॥

సీ॥ శ్రీకరౌర్యస్తుతాస్తోకధర్మైకశోభాకరుండువిభావిభాకరుండు।
చండబాహార్జితాఖండసద్వైభవాఖండలుండుజితారిమండలుండు।
శేషాహిభాషావిశేషానుకారిసంభాషణుండురుదయాభూషణుండు।
బంధురరక్షణకళాబంధురప్రతిభాధురంధరుండువితీర్ణికంధరుండు।
తే॥ గీ। దుష్టరిపుభీతికరనవదుర్గసహిత।మహితవిలసపరల్ పురిమందిరుండు।
సుందరుండుమహాధైర్యమందరుండు।దివ్యవీరేశలింగసుధీవరుండు॥ ౪౮॥

తే॥ గీ। అట్టివీరేశలింగార్యుఁడాదెమాంబ।యనెడుసాధ్వినిఁబెండిలియైఘనుండు।
శరభలింగాఖ్యనునుఁగాంచెసద్గురూప।దేశశివభక్తవరచిదాకాశమతిని॥ ౪౯॥

వ॥ ఇట్టినేను,॥ ౫౦॥

## షష్ఠ్యంతములు

క॥ శ్రీరామజోగిసద్గురు।ధీరసునామునకుదేవదేవునకుభవో।
ద్ధారకునకుదాతునకు।నారాయణసఖ్యునకునున్యాయపథునకున్॥ ౫౧॥

క॥ ధీరునకుసకలనిగమా।ధారునకునిరంతరాత్యుదారునకునిరా।
కారునకుభక్తజనమం।దారునకునవాద్యఖండితశరీరునకున్॥ ౫౨॥

క॥ రంభాకుచకుంభపరీ।రంభానందద్విపక్షరాణ్ణుతశౌర్యా।
రంభునకున్ శుంభజ్జయ।సంభావితనిజభుజాసిసంరంభునకున్॥ ౫౩॥

క॥ నగపతివరచాపునకున్।నగధరసద్బాణునకునునగజేశునకున్।
మృగచర్మాంబరధరునకు।మృగయాపురివర్యునకునుమృగధరణునకున్॥ ౫౪॥

వ॥ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన నలంకారచంద్రోదయంబను మహా
పత్రిబంధంబునకుం గథావిధానంబెట్టిదనిన ముమ్మార్కండేయుండు క్రోష్టియనుశిష్యు
నకెఱింగించిన తెలుంగునందిరంబుగ జైమిని మహామునికింబక్షులిట్లనియె॥ ౫౫॥

## కథాప్రారంభము.

సీ॥ ఏవీట సౌధాగ్రసౌవర్ణకలశంబులబ్జకోశంబులౌ నమరధునికి।
నేవీట సతులతనూవిలాసంబులు ప్రార్థనీయంబులౌ నచ్చరలకు।
నేవీట మణిదీపికావిభావిభవము భావంబొనర్చు విభావరులకు।
నేవీటఁ జంద్రశాలావితానస్థహారములు తారావళీభ్రాంతి నొసఁగు॥
తే॥ గీ॥ తుంగతరరోహణాచలశృంగతులిత।గురురుచిరరత్నశోభితగోపురంబు।
చెలఁగు నైశ్వర్యసుషమావిశేషహసిత।సురపురంబు ప్రతిష్ఠానపురవరంబు॥ ౫౬॥
చ। ధరనొకరాజశేఖరుని తానక మైతగు వెండికొండవి।
స్ఫురణమ దంతయంచవధిభాధరరాజము నేక రాజశే।
ఖరులకు మన్కి యైబహుళకాంచనసంపదఁ దాల్చియ స్ఫురిన్।
స్థిరముగ నిల్చె సాఁగనకశృంగసమున్నతవప్ర మొప్పగున్॥ ౫౭॥
కం॥ అన్నగరికోటకొమ్మల।కన్నఁగఁ గల్యాణసహితపృథుమణివరరా।
గోన్నతి గలుగుటయరుదే।సన్నుతవిష్ణుపదసేవసతతము దొరకన్॥ ౫౮॥
తే॥ గీ॥ కలశభవుఁడు తన్నుఁ గడునల్క వెండియుఁ।ద్రావునేమొ యనుమఁ దల్లడిల్లి।
యబ్ధి ఖేయమగుచు నప్పురిఁ డాగెనో।యనఁ నగడ్త దనరు నద్భుతముగ॥ ౫౯॥
కం॥ పాతాళభువనపన్నగ।జాతము తత్ఖేయతోయజాతమృణాళ।
వ్రాతములఁ గాంచి నిజకాం।తాతనులతలను చుఁబెనుచుఁపత మోహమునన్॥ ౬౦॥
ఉ॥ మేలిపసిండి మువ్వగమిమించు పతాకలు చిత్రరత్నపాం।
చాలికలబ్జరాగకలశద్యుతులుం గల చంద్రశాలికా।
జాలము వొల్చు పట్టణఁపు సంపదఁ గన్గొననిల్చు నిర్జర।
స్త్రీలనభస్స్పృశచ్ఛిఖరదివ్యవిమానవితానమో యనన్॥ ౬౧॥
చ॥ అరుణగభస్తి మున్న హరహంబును నంబరవీధి నేగఁగాఁ।
బురవరభర్మహర్మ్యచయముల్ గమనంబునకడ్డమైనచోఁ।
దురఁగములన్మరల్చి ధృతితో నగరోత్తరయామ్యపార్శ్వస।
త్సరణులఁ దేర నూరుఁడు వెసన్ గడపన్ జనుచుండు నెప్పుడున్॥ ౬౨॥

కం॥ నెచ్చెలులభంగినిచ్చలు । వచ్చుచుఁబోవుచు నెయుండు వాతాయనముల్ ।
సొచ్చుచుఁదగుణులనఖరుచి । మెచ్చుచుఁదారకలువీటిమేడలఁద్రోవన్ ॥ ౬౩॥

చ॥ అలగ్రహరాజా తేజమిసుమంతయుఁగన్పడకుండ నెప్పుడున్ ।
గలఁచఁగఁగోరికేతువుపగంగొనివిష్ణుపదంబుముట్టియుం ।
పలరననేకరూపములనర్కునిఁగప్పెననంబరంబునం ।
దలరునురత్న సౌధశిఖరాళినటత్స్ఫుటకేతుజాతముల్ ॥ ౬౪॥

కం॥ చందురుడందులమేడల । సందులఁజనుచుండి కావ్యసంగీతకళల్ ।
సుందరులవలనవినితాఁ । జెందెఁగళానిధియనం బ్రసిద్ధిధరిత్రిన్ ॥ ౬౫॥

చ॥ లలితజలోర్ధ్వయంత్రనిర్ఝరులంబసఁబొడిగధూపధూమకుం ।
తలములఁగేతుహస్తకలనన్నగరేందిరవిప్పిసొమ్ములం ।
దళియలనుంచెఁబ్రోవులుగనాఁబొలుపొనవరత్నరాసుల ।
న్విలసిలుకాంచనాంచితవణిగ్విపణీరమణీయహట్టముల్ ॥ ౬౬॥

చ॥ జిలుగుకడానివన్నియలఁజెన్నగునున్నతసౌధవీథివే ।
డ్కలశశికాంతజాలములడగ్గరిసారెకుఁదొంగిచూచుక ।
న్నెలముఖలక్ష్మికిన్ సురధునీవికచాబ్జములోడెఁగానినో ।
లలినవిదుర్యశంబళికులచ్ఛలనన్వహియింప నేటికిన్ ॥ ౬౭॥

కం॥ శ్రుతిముఖ్యసకలవిద్యల । గ్రతుసద్వ్రతజపతపఃపరంపరనచటన్ ।
శతధృతిసృజియించెనరా । కృతులుగనఁదనరుదురుపురిన్ విప్రవరుల్ ॥ ౬౮॥

కం॥ మారులునరరూపమునఁగు । మారులుదోశ్శక్తి, భూతిమహిమంబునఁగా ।
మారులు, దానమునరవికు । మారులు, వణిలుదురరాకుమారులువీటన్ ॥ ౬౯॥

కం॥ ఆర్యనుతులగుచునచటన । హార్యసమానధనరాసులార్జింపుచున ।
య్యార్యపతిహితసములుమ । హార్యులుదనరుదురకుంఠితౌదార్యములన్ ॥ ౭౦॥

కం॥ హలరేఖలులక్ష్మీకర । విలసనములుబహులభద్రవిభ్రమగతులుం ।
గలిగిహరిచరణసదృశత । నలరుదురలఘుబలమొప్పనప్పురిశూద్రుల్ ॥ ౭౧॥

తే॥ గీ॥ బలవదుత్తుంగరూపవైభవమతిస్థి । రాభరణలీలతతగండశోభితరుచి ।
శ్రితఘనాళిసదావనశ్రీయుఁగలిగి । పొలుచుభూభృన్నిభంబులప్పురినిభములు ॥ ౭౨॥

చం॥ స్థిరతర రాజహంసాళిహితసేవకులంబున కెల్లఁ గల్లగా ।
హరిణములాదిదుర్గముల నాయతసత్కరణాప్తి నుండిస ।
త్త్వరచితసారయోగగతి వాయుజయంబొనఁ గూడ వీటిలోఁ ।
నరయు ననంతవర్ణకములై హరులై బహుతన్ ప్రవర్తిలున్॥ ౨౩॥

కం॥ ఘనచక్రఘటనసంపదఁ । దనరి ప్రభాతంబులట్ల ధరణీశులరీ ।
తిని విలసిల్లుఁ బురవరం । బునఁ గాంచనరత్నదీప్తము లగు రథంబుల్॥ ౨౪॥

సీ॥ సంగీతనృత్యకౌశలము మెచ్చుటఁ బలె గాయన్నటీకైశికములు నిమిరి ।
దంపతీప్రణయవాదములు దీర్పఁ బలె వేసవల సౌధగవాక్షకోటి దూఱి ।
స్వేదశ్రమంపు నీర్వట్టు దేఁ బలె రతిశ్రాంతాంగనాస్యఘర్మజలమాని ।
సాంకవమృగమదచంద్ర సౌరభములు గైకొనంగఁ బలె నంగళ్ల మెలఁగి॥
తే॥ గీ॥ పురతురంగమగమనచాతురికి నోడి । వింత సిగ్గునఁ దనయొక్కరింత వడిగ ।
నడవమిన నంగజడనగు నడకలపుర । నందోలయుచుండు మలయమందానిలుండు॥ ౨౫॥

సీ॥ అమితరసప్రౌఢి నలరెడిసరసుల నెనయుటవలనఁ బద్మినులనంగ ।
లలితబంధవిశేషములమహాభోగులఁ దనుపుటవలన భోగినులనంగ ।
ఘనతరాగములఁ బెంపెనసి పల్లవలాభగరిమఁ బొల్చుటఁ గలకంఠులనఁగ ।
తజ్జ్ఞులు వినుతింపఁదగు వెలలందు మమనుటచేసు రుచిరమణు లనంగఁ ।
తే॥ గీ॥ ప్రబలితతమంజులాస్యవిభ్రమసమృద్ధు । లలరఁ బ్రీతిధరతరవాస్యములనువలఁతు ।
లగుచు రంభాదులజయించు సొగసునఁ బురి । వెలయుచుందురు వారసుందరులు బళి రె॥ ౨౬॥

సీ॥ రమణి యెత్తులకే మిరతికల్పచయమిమ్ము వలదందు నిడుదు రే వచ్చిన పుడ ।
వెలయనీపుష్పాప్తి వేఁడెల్లుము తొవులంటి చూచినఁ దోఁచు నదు మగనేలఁ ।
దిలకింపు మెల తొమరలదండనోసఁగుము నెనరొప్పఁ గావలసిన నుగోనుము ।
విలువఁ జేకొని యెదనలను బంతులనిమ్ము పెను బంతులిప్పుడు దంటె పనుగందు॥
తే॥ గీ॥ ననుచు నర్మోక్తిరచనల ననుచు వేడ్కఁ । దమ్మునలరమ్ము మేటిచైదమ్ములఁ గని ।
సరసతలు చూపు విటులకు సరములిడుచుఁ బుష్పలావికలు పురస్పుటమునందు॥ ౨౭॥

మ॥ సురసాంచద్ఘనపుష్పపూరితములై సొంపొందిదృప్తాండజో ।
త్కరసంచారపటుత్వముల్గలిగి రంగద్భృంగసంగీతము ।
ల్వఱలన్ సారససౌరభానిలసదాభంగాగమంబుల్గనన్ ।
బురినుద్యానములున్ సరోవరములున్ బొల్చున్ సమత్వంబునన్॥ ౨౮॥

శా॥ ఏతాదృఙ్మహనీయసంపదలపుట్టిల్లై శుభస్థానమై।
క్ష్మాతన్వీనవరత్నకీలితవతంసంబైన యాపోలువి।
ఖ్యాతిం జెందఁగ నేలుచుండు గుణరత్నాంభోధి శత్రుంజయుం।
డాతం డాతతశాతహేతిపవికృత్తారాతివీరాద్రియై॥ ౭౯॥

సీ॥ తనయశోనల్పకల్పనగాటవికిఁ బయోభృత్పథంబొక పరభృతము గాఁగ।
దనప్రతాపమహాజ్వలనకీలములకర్కబింబంబు విస్ఫులింగంబు గాఁగ।
దనజయలక్ష్మీనితంబినికఖిలదిగ్వలభులు విహారణస్థలులు గాఁగ।
దననిరంతరదానధారానదికిసాగరములు గర్భజలాశయములు గాఁగ।
తే॥ గీ॥ తనవినిర్మలచరితసుధాసరోంత।రమునకబ్జభవాండభాండములు పుండ।
రీకముకులాళిగాఁగ వర్తిలుఘనుర్వి।ధానమృత్యుంజయుండు శత్రుంజయుండు। ౮౦॥

వ॥ మఱియు నీసమస్తప్రశస్తనిస్తులామేయసుగుణవిస్తారుండగు శత్రుంజయుండు నిఖిలాశావిలాసినీకర్ణమండితమండనాయమానకుండలీకృతకీర్తిలతాక్రాంతవిశ్రాణనపల్లవసల్లలితోల్లాససకలభూతదయాకుసుమగుళుచ్ఛుండును, నిరంకుశప్రతిభాప్రభావిభాసితుండును, కదనక్షోణీసదనసమదహృదయవైరివీరవారపరిహారప్రకారప్రచారావార్యస్థైర్యశౌర్యవీర్యధుర్యుండును ప్రచండాఖండకోదండవిద్యాషండప్రశౌండప్రజ్ఞానధురంధరుండును, ధీరోదాత్తగుణధురాధరుండును, నయి తనకప్రతిష్ఠానపురవరంబు రాజధానిగా రాజిలరాజరాజునుంబోలెఁ దేజోవిరాజమానుండై సకలకువలయంబు వక్రవిక్రమంబున నేకచక్రంబుగఁ బరిపాలింపుచుండె॥ ౮౧॥

కం॥ ఆరాజశిఖామణికిఁ గు।మారుండు కుమారసదృశ మానితవీరో।
దారుఁడు మఖపరిజాఖ్య।క్ష్మారమణుండలరుచుండు సద్గుణనిధియై॥ ౮౨॥

సీ॥ సరసిజాక్షుఁడువోలె సిరితోడ నలరి భర్గునిభంగి నార్యానుకూలుఁడగుచు।
గంధర్వరీతిఁ జక్కనిరూపుఁ దాల్చి యబ్జునిమాడ్కి గురుకళాపూర్ణుఁడగుచు।
పరమేష్ఠిగతిమంజుభాషాఢ్యుఁడై సరిత్పతిపోల్కి నిమ్నస్వభావుఁడగుచు।
సూర్యునిపగిదిఁ దేజోమహత్త్వముఁ గాంచి చిఘునునికైవడి దానకలితుఁడగుచు॥
తే॥ గీ॥ నాగమార్గస్థుఁడై వివిధాస్త్రశస్త్ర।వేదియై దండనీతిపరీణుఁడగుచు।
నమరుసమధికభోగమహావిభవశ।చీవిభుండు మఖవ్రజభూవిభుండు॥ ౮౩॥

ఉ॥ ఆ విభు మోము సొంపు గని యద్భుతమందుచు క్షీణుఁ డయ్యెఁ దాఁ
జావక నైల్యమొందితగఁ జంద్రుఁడు దూరపదంబుఁ జెందఁగన్
భావజుఁ డింత యున్నె నను చు భంగము నొందిన మామఁ దేర్చవే
భావరుఁ జేరి యందమునఁ బోలక నంగత నొందెనిద్ధరన్॥ ౫౫॥

వ॥ మఱియు నతండు నారాయణాంశ సంభూతుం డగుటం జేసి వినీతుండును సమపరిక్షా సమేతుండును నుంగావున జనకుననుజ్ఞ యౌవరాజ్యాభిషిక్తుండై, నల, నృగ, సగర, భగీరథ, దుందుమార, సుహోత్ర, మాంధాతృ, శ్రీరామాదులకరణి ధరణీభరణదక్షుండై, దీనాలాపంబులు శరణాగత శాత్రవముఖంబులయందు, వక్రిభావంబు లధిజ్యశరాసనంబుల యందు, దృఢబంధంబులు సురతంబులయందు, కుటిలనటనంబులు వేశ్యాజనంబులయందు, సదాపత్ప్రాప్తి చే మొఱవెట్టుట తరుణీమంజీరంబులయందు, మదాంధత్వంబు నందిరుఁగుట కరిఘటలయందు, పరుషదండంబు వలనఁ జక్రిపరికంపంబులు వొడముట కులాలకృత్యంబుల యందు, సమస్తవస్తుసంపదలందోఁచుట లీలాదర్పణంబులయందు, పాంసులాత్వంబవని యందు, చెన్నొందుచుండెఁ, దనధర్మంబునకు భావంబును, దనదానంబునకు ప్రమాణతయుఁ, దనక్రోధంబునకు స్థిరత్వంబును, దనవిక్రమంబునకు సహ్యతయు, దనయశంబునకు దివ్యాసంగవ్యాప్తియుఁ, దనగుణంబులకు త్యాగశాపరివృత్తియుఁ, దనలేమికి లేమియుండ వులం జేసి యఖండసామ్రాజ్యధుర్యుండై, మహావీరుండయ్యును బరలోకకగాంభీరుండై, కామార్థపరుండయ్యును విమలధర్మప్రసన్నుండై, యనేకపరిజనపరివృతుండయ్యు ననేకధనుస్సహాయుండై, భూమండలంబున నెల్లెడ నిరంతరపయోధారాసారంబులు జలధరంబులందునుంబోలె ధేనువులందును, ననంతకళ్యాణాలంకరణంబులు జనశరీరంబులందునుంబోలె గృహంబులయందును, సంపూర్ణఫలవిలాసంబు లారామంబులందుంబోలె సస్యంబులందును, నపరిమితామోదంబులు సరిక్ఛందనాదులందుంబోలె సకలప్రాణిచయంబునందుం గలిగి విలసిల్లు ధర్మపరిశీలనంబున ప్రజాపాలనంబుఁ గావింపుచుండ॥ ౫౬॥

మత్తకోకిల॥ అంతభూరమణీధృతాభినవారుణాంశుకరూపసం
క్రాంతపల్లవకాంతిదంతురకాననాంతమనంతమో।
హాంతరంగవధూనితాంతదృగంతకాంతలతాంతసం।
భ్రాంతిభృంగలతానిశాంతము బల్వసంతము భాసిలెన్॥ ౫౭॥

చ॥ శ్రుతిహితవాక్యముల్ బలుకుచుఁ ద్విజపాళి మొలంగఁ గేళిప।
ర్వతశుభవేదులందుఁ బ్రసవర్తుదినాత్మవివాహవేళను।
న్నతలతికామహీజమిథునంబుల పైనిత శేతరంబుదా।
రతనిడుముత్తియంపుఁ దలఁబ్రాలనజాలక రాజిరాజిలెన్॥ ౫౭॥

చ॥ ఎలయుచుఁ దేఁటిమొత్తపు మొయిల్వొయిఁ గప్పిరవంబొనర్పఁగో।
యిలలను వానకోయిలలు హెచ్చఁగ నచ్చపుఁబూవుఁదేనెసో।
నలుగురియన్వనానిలమునం గొమరొప్పఁ జలించె గొమ్మఱుం।
గులగతిఁ దియ్యమావియొలగున్నలఁ గ్రొందలిరాకుజొంపముల్॥ ౫౮॥

మ॥ వనరాశ్యుద్గతఫేనముల్ వనరమావక్షఃప్రభారమ్యమం।
డనరోచుల్ మధుపప్రతానమధుపానప్రక్రియాకాప్యసా।
త్రనికాయంబులు చైత్రరాత్రిముఖనిర్యత్తారకల్ వల్లికా।
వనితాంచద్దరహాసముల్ సితసుమవ్రాతంబులొప్పెన్ వనిన్॥ ౫౯॥

చ॥ చివురుఁగటారులున్ విరులసింగిణులుం దలిరాకు బాకులు।
న్ననవలిశింజినుల్ సుమపరాగమునన్మొఱుఁగక్కఁ జేసిమా।
ధవుఁడనుఁగైనమారునకుఁ దానొనఁగూర్చినయస్త్రశాలల।
ట్లవిరళలీలనొప్పవనినంచితమంజునికుంజపుంజముల్॥ ౬౦॥

చ॥ కొలఁకులఁ దేలి తేలి తొవగుంపులకంపులసోలిసోలి మ్రా।
కులపయి వ్రాలి వ్రాలి సుమగుచ్ఛసుగంధముఁ గ్రోలి క్రోలి తీ।
వలగమిఁ గ్రాలి క్రాలి తరుపజ్ఞులనీడలఁ దాళితాళి మే।
ల్మిలుకడనీ వెనామునివనీతలశీతలవాతపోతముల్॥ ౬౧॥

కం॥ అలినీకుటుంబినులకున్ । లలినీరుఁబుబొమ్మరిండ్లలతికాపాంచా।
లులనవపుష్పోద్గమవే। కలవవరమతే నెవిందులను గావించెన్॥ ౬౨॥

కం॥ వసుపతితానగుటనునల। వసుపతిమైత్రికఁ దదాశవఱలెననవిభా।
వసుఁడుత్తరంపుఁద్రోవను। మసలెన్ దనమిత్రభావమహిమపలిర్పన్॥ ౬౩॥

తే॥ గీ॥ విరహితతిమీఁదపండెత్తుమనుని విజయ। కాహళులభంగి మొరసెఁ బికవ్రజంబు।
లమరెఁ గోరకములుఁ గింశుకములుఁ గాన। నస్థలీస్త్రీలకెంపులనత్తులనఁగ॥ ౬౪॥

సీ॥ నవరసామోదంబు సవరించె నెయ్యది తరులయందును ఘనతరులయందు।
సుమనోవికాసంబు సమకూర్చె నెయ్యది శ్యామలందును నవశ్యామలందు।
మధుపరాగసమృద్ధి మననిచ్చె నెయ్యది తమ్ములందును లతాంతమ్ములందు।
లలితకుంకుమపత్రకలన మెయ్యది నించెఁ గొమ్మలం దెలమావికొమ్మలందు।
తే॥ గీ॥ నట్టిసురభికి సురభివిఖ్యాతి గలుగు। టరిది యే సత్ఫలములు ద్విజావళులకు।
బాలగణికలకును నవీనపల్లవాప్తి। లలిఁ బ్రసవయుక్తి వంధ్యాదులకు నొసంగ॥ ౬౪॥

లయవిభాతి.

తళతళని మెఱుఁగలరె నలరులను గలికలను జలజలని వఱదలుగ బలు మధువు వాలెన్।
గిలకిలని కలికి చిలుకలపలుకులు లిసెనల బలముల లికులములను గలయఁ బోలు సాలెన్।
ఫలరసములు లిచిలతికలకొనలఁ బొలిచెఁ గలగలమనుచు బరిణతఁ పుదళములిల రాలెన్।
జెలువులకుఁ జెలులకును వలపు లెద వెలసెఁ గలకలరుతులఁ గొలకులను నెలకొనియెనంచల్॥

సీ॥ తరులలోఁ దీవపందిరులలో విరులమంజరులలో మకరందఝురులఁ గ్రోలి।
గములై తనర్చి పూగములపైఁ దగి పరాగములు పైకొని సురాగములు మించి।
చెలువొందు గుజ్జమావులయందుఁ దలిరుఁ గ్రోవులయందు నవలతావులఁ బెనంగి।
స్ఫుటములై కలితనిష్కుటములై శ్రితపుష్పపుటములై ఘనవనీతటములరసి।
తే॥ గీ॥ తమిని మొగపెంటిపిల్లతండములుఁ గలసి। గలశిరంబులఁ బాదే నిగప్పికొనఁగఁ।
గొనగరులు విప్పియపుడు ఝుమ్మను మఁబొవల। బొడలరొదలిడి కొదమతుమ్మెదలు మెపలు॥

మ॥ కలితాశోకలతాంతదీపరుచిరంగత్కుంజగేహంబులోఁ।
గలకంఠీతతి రాగపీక్షణము సోకన్ దార్చఁగా దక్షిణా।
నిలుడల్లల్లనఁ దావులంటుకొను చో నీరంధ్రమాధ్వీరస।
చ్ఛలసారోద్గములై వడంకిరిల వాసంతీలతాబాలికల్॥ ౬౫॥

మ॥ ఘనరంగంబులపైఁ దమాలవృతి నేపథ్యంబులో పుంబిక।
స్వనగీతంబులతో మరున్నటుఁడు లాస్యప్రౌఢి నేర్పం జిగు।
ళ్ళను కేల్ద్రిప్పచు వల్లిపాత్రములగుం పాడన్ వసంతప్రభుం।
డనుకంపామతి మెచ్చి యిచ్చెఁ గుసుమప్రాంచన్మణీభూషలన్॥ ౬౬॥

### లయగ్రాహి.

చందనమహీరుహములందుఁ బెనగొన్న గురువిందనునుదీవియలపందిరులలోఁ బెం।
పొందివిరవాజిపువ్వుగంధవడి లేచిచనుమందమలయానిలునిఁ జెందు పెనుతావిన్।
గ్రందుకొని ఘుమ్మురనుచుందనరుపూబొదలసందులమెలంగి బలుచందములచేమా।
కందసుమబృందమకరందరసబిందువులవిందులుగఁ గ్రోలెను మిళిందతతులెల్లన్ ॥౧౦౦॥

సీ॥ మునుమాపు నులివిచ్చుబొండుమల్లెలుసోగక్రొమ్ముడి నెరతావిఁ గ్రుమ్మరింప।
నునుజిగురాకుపొన్నలవిరిపరుపుల నెసఁగు నేలకి పొదరిండ్లఁ జొచ్చి।
మధురసీధురసాత్తమదమాంద్యమునఁ బునఃపునరుపగూహనంబున మిటారి।
వలిచన్నుఁగవ లురంబున నాటనఁ బులకపురంపుఁ బోడిఁ జిమ్ముకమ్మ తెమ్మె॥
తే॥ గీ॥ రలునితాంతోపరతిపరిశ్రమసముద్ధ।క్రమగల్లతలస్వేదకణికలార్పఁ।
బతులయెడఁ గూర్కు సతులు రేపకడఁ దెలసి।రలఘునిష్కుటశుకపికకలకలముల॥ ౧౦౧॥

వ॥ ఇట్లు సకలజగదామోదకరవిలాసభాసురంబులగు వసంతవాసరంబులు జరుగు మండనఖండనస్థాంపర్యధుర్యతామకరధ్వజుండగు మఖప్రజాండుపుడమిం బాలింపుచుండె॥

కం॥ అనిమార్కండేయమహా।మునిక్రోష్టికిఁ జెప్పినట్లు ముదమునఁ బక్షు।
ల్వినుపించినపుడా జై।మినియన్వలికఘనుఁ బేర్మి మెయి నడుగుటయున్॥ ౧౦౩॥

చ॥ సురగిరిధీరధీరచితశోభితదివ్యకలాప్రసంగసం।
గరజయశూరసూరిజనకల్పకపాదపపాపనా।
పరచరిమార్గసారగురుసన్మయచిన్మయసాక్షిభాస్వరా।
స్వరపరిభావభావభవసంహరసంహితసంహితస్తుతా॥ ౧౦౪॥

కం॥ ప్రేమాస్పదవరకామాకామాంతకయంతకాంతకాకాంతియశో।
ధామాధామవిజితరిపు।భీమాభీమబలయోధభీమస్తోమా॥ ౧౦౫॥

### పంచచామరము.

మలీమసప్రణాశభాసమానితాత్తధీరసా।
విలాసమానసప్రకాశవిశ్వకృద్దయారసా।
కలాపసత్కశాకలాపకావ్యకంజఖంజనా।
పలాశభంజనప్రతాపభక్తచిత్తరంజనా॥ ౧౦౬ ॥

మాలినీ.

నిరుపమగుణజాలానిర్మలానందలోలా।
సురుచిరశుభలీలాశోభితాత్మైకహేలా।
స్మరహరవరఖేలాసంవిదామేయశీలా।
సురమునిపరిపాలాశూలిసృష్ట్యాదిమూలా॥ ౧౮౭॥

గద్య.

ఇదిశ్రీమదిమ్మానేన్యన్వయపయఃపారావార రాకాసుధాక రానవరత దేవబ్రాహ్మ
ణపూజావిధేయదిగంత రాక్రాంతయశః పరిపూరితశ్రీ బాపనార్యపౌత్రవీరే
శలింగనాయకపుత్రశ్రీమద్గౌరీరమణచరణారవిందామందమకరంద
పానతుందిలేందిందిరాయమాణశ్రీదక్షిణామూర్తి రామజోగి
గురుప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషాచతు
రకవితావితానానూనవైభవబుధజనవిరాజ
మానశరభలింగాభిధానప్రణీతంబైన
యలంకారచంద్రోదయంబను
మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

శ్రీ మఖ్రవజ చరిత్రంబను నామాంతరము గల

# అలంకారచంద్రోదయము.

## ద్వితీయాశ్వాసము.

కం॥ శ్రీరమ్యగుణాభరణా। నారాయణబాణవరణనతజనవిస్తా।
రారాధితనిత్యదయాంకూ రామృగయాపురీశగురుగుణవేశా॥ ౧॥

తే॥ గీ॥ అవధరింపుముమునుమృకండాత్మజాండు। క్రోష్టికతెఁగించినట్లుసద్గోష్ఠినమరు।
జైమినికినెమ్మనముగడుసంతసిల్లఁ। బక్షిరాజంబులిట్లుచెప్పందొడంగె॥ ౨॥

వ। అంతనొక్కనాడుమఖ్రవజుండుపురోహితామాత్యబంధుమిత్రాదిపరిజనసమే
తుండైజనకుసన్నిధానంబుననిండోలగంబునఁగొలువైయుండుసమయంబున॥ ౩॥

సీ॥ ఉదయించురవిమించునదలించుజగిమించునొడలితోముడిచినజడలతోడ।
సరసీరుహాముఁగేరుకరమునమీరుదండంబుతోనూర్ధ్వపుండ్రంబుతోడ।
బంగారుజిగిసారుపొంగారుకుండలద్యుతులతోశ్రుతివాక్యతతులతోడఁ।
దెలిజందెములపొందికలఁజెందునక్షమాలికలతోనరుణశాటికలతోడ॥
తే॥ గీ॥ సలలితామలజలకమండలువుతోడ। దంబుమీఱినకృష్ణాజినంబుతోడఁ।
దనరనరుదెంచెగాలవమునివరేణ్యుఁ। డశ్వరత్నంబొకటివెంటనరుగుదేర॥ ౪॥

శా॥ ఆరీతింజనుదెంచియమ్మునివరుండస్తోకచామీకర।
స్ఫారోదారకవాటగారుడరుచివ్యాకీర్ణరాణ్మందిర।
ద్వారంబున్నతరోహణాద్రికటకోదంచన్మహాగహ్వరా।
కారంబుద్ధతనీరమున్గడచిరాఁగాఁబార్శ్వభాగంబునన్॥ ౫।

సీ॥ కరదీప్తకనకకంకణకలక్వణముతోఁ గమనీయమణులు చామరములు వీవఁ।
జరణనూపురములసాలభంజికలట్లు శరణాగతనతారివరులు దోఁప।
సామంతభూషామణీమయూఖములు సంధ్యారుణాతపములనవఘళింప।
వివిధవేదాగమవిదులగువిద్వజ్జనులు శ్రుతిస్మృత్యర్థములను దెలుప॥
తే. గీ॥ హారకుండలమకుటకేయూరకటకమణులు దీపింపఁ గులశైలమధ్యమేరు
వనఁగ సభికులనడుమ సింహాసనస్థుఁడగుచుఁ గొలువున్న శత్రుంజయనృపుఁ గనియె॥ ౬॥

కం॥ కనుఁగొని సునమగుముంగిటఁ గనదిందూపలనిబద్ధకక్ష్యాంతరసీ
మను బ్రతిబింబితమై నిజతనురుచి దసరమునియవనిధవుదరి కరిగెన్॥ ౭॥

కం॥ వచ్చినమునిఁ గనియెదురుగ వచ్చి ప్రణామంబొనర్చి వరభక్తినయం
బచ్చుపడ నర్ఘ్యపాద్యము లిచ్చి సుఖాసీనుఁ జేసి నృపవరుఁడనియెన్॥ ౮॥

ఉ॥ ఓమునినాథ భూరిసుకృతోదయ మీసుతశిష్యకోటికిన్
సేమమె? వహ్నులున్ గ్రతువిశేషములున్ వెలసిల్లునే? ఫల
స్తోమముతోడ నాశ్రమవసుంధరభూరుహసస్యశాలిగో
ధూమములుండునే? వ్రతవిధుల్దగునే విగతాంతరాయతన్॥ ౯॥

కం॥ మీరు మహాత్ములరధికులు రారయ మీదర్శనము శుభాస్పదముగదా
మీరాకవలనఁ బావనమై రాజిల్లె మన్నివాస మమలచరిత్రా॥ ౧౦॥

కం॥ అనివినుతించిన జనపతికనియె మునీంద్రుండు భూవరాగ్రణి యుష్మ
ద్ఘనధర్మపాలనంబున ననిశము సకలంబు భద్రమయ్యెడు నవనిన్॥ ౧౧॥

ఉ॥ మానవనాథుఁడిట్లనియె మౌనివరేణ్య భవన్మనోరథం
బేనొనఁగూర్తు మీరిచటికేమికతంబున నేగుదెంచినా
రానతియిండు శీఘ్రముగ నన్నఁ దురంగవతంసమున్మహీ
జానికిఁ జేతఁ జూపి మునిసత్తముఁడిట్లని పల్కె వెండియున్॥ ౧౨॥

మ॥ వినుముర్వీవర యజ్ఞమేనొకటిఁ గావింపంగ దీక్షింపుచోఁ
దనుజుల్కొందరు సింహసూకరమృగాదవ్యాఘ్రరూపంబులన్
ఘనమాయాగతి వచ్చి హెచ్చి మఖవిఘ్నం బాచరింపందదా
హననోద్యుక్తుఁడనయ్యు మత్తపము వమ్మౌనంచు లోనెంచుచున్॥ ౧౩॥

కం॥ కొండొకవెరవుమాహింపుచు। నుండఁగ మనుశాలి కాంతరోజ్జ్వలహోమా।
ఖండంబగుకుండములో। నుండిమహోద్దండ తేజ మొక్క హయంబున్॥ ౧౪॥

తే॥ గీ॥ యజ్ఞపురుషుండుగొనివచ్చియాతఁడనియె। నోయిమునివర్యయీతురగోత్తమంబు।
నలమఖవ్రజానకొసంగుమతఁడునీదు। సవమునిర్విఘ్నముగఁ జేయఁజాలు నెలమి॥ ౧౫॥

వ॥ మఱియునీయుత్తమాశ్వం బధికబలసంపన్నం బేక రాత్రింబునంజతుస్సముద్రముద్రితవసుంధరావలయంబునం గ్రుమ్మరివచ్చునితరలోకగమనంబును గగనయానంబునుం గలిగియాహవజయంబొనఁగూర్చునదియునుంగాక గరుడునియంశంబునం బ్రభవించినయీ తురంగరత్నంబునీమఖవ్రజుండుపక్కనితరులెక్కంజాలరతండు దుష్టనిగ్రహశిష్టపరిపాలనార్థంబునకైతజ్జనకతపోమహిమంబునం జేసిశ్రీమన్నారాయణుం డేతద్రూపంబునవతరించినమహామహుండును, సర్వభూతాంతర్వ్యాప్తుండుఁ గావున వాసుదేవుండును, సచ్చిద్రూపుండుఁ గావునఁ బ్రజ్ఞాధురంధరుండును, మఖవ్రజసంరక్షకుండుఁ గావున మఖవ్రజనాముండునై వెలుంగుచున్న వాఁడమ్మహాత్ముంను భవన్మఖరక్షణంబుఁ గావింపనోపుఁ గాన నవ్విధం బాచరింపుమని యొఱింగించియయ్యగ్నిభట్టారకుండంతర్హితుండగుటయుసవిస్మయహర్షంబుతో నీయశ్వరత్నంబుఁ దోడ్కొనిభవత్సముఖంబునకరుదెంచితిం గావున, నరేంద్రా? నీనందనుండికార్యనిర్వహణంబు సేయుటకైజన్మించిన శ్రీమన్నారాయణుండు గానికేవలనరమాత్రుండు గాఁడస్మదీయమఖరక్షణంబునకద్దివ్యతేజానకులగ్గగునని పలికిన నాశత్రుంజయభూభుజుండట్లకాకయనియత్యంతసంతుష్టాంతరంగుండై నిజనందనుం దిలకించి నీవీమునివర్యునియభీప్సితంబుఁ దీర్చుటయవశ్యకర్తవ్యంబు గావున॥ ౧౬॥

కం॥ మున్నలవిశ్వామిత్రుని। జన్నముర క్షించి మరామచంద్రునిగతినీ।
జన్నంబుఁ గాచిసుజనో। ద్యన్నుతిఁ గైకొనుముశోభితనయా తనయా॥ ౧౭॥

ఉ॥ వీరుమహాత్ములార్యులువివేకవరిష్ఠులుసత్తపోనిధుల్।
కారుణికోత్తముల్ మునులుఁ గావునవీరలయజ్ఞరక్షకై।
ధీరతనేగిదానవులఁ దీవ్రశరంబులగెల్చివిక్రమో।
దారతఁ జెందిదీవెనలనందిరయమ్మునరమ్ము నాపుడున్॥ ౧౮॥

కం॥ మునిఁ దొలుతననిచిపిమ్మట। జననాయకనందనుండుజనకాజ్ఞనుఁ గై।
కొనివల్లెయనియపుడ। మ్మునియాశ్రమమునకునరుగ ముదితహృదయుఁడై॥ ౧౯॥

సీ॥ పసఁగుల్కు పసిఁడికొమ్మిని మిసిమి పాగ ధరించి డంబు మీఱిన కత్తళంబుఁ దొడిగి।
కానునజిలుఁగు చెంగావి కాసె బిగించి కఱకు బంగరునూరె మొలను జుట్టించి।
కురువిందచూడ్కి మైకొను ఱలుకేడెము పచ్చపసఁబూజా వాలును గటిపై నమర్చి।
దుగదొనల్ భుజములఁ దగిలించి నిగనిగ నీలంపు వింగిణి కేలఁ బూని।
తే॥ గీ॥ చరణముల గండపెండేరఁపు రుచి గప్పఁ। గరతలంబున వీరకంకణము మెఱయ।
వీరరసమిట్లు మూర్తీభవించె ననఁగ। నమరె గమనోద్యమమునఁ దేజము తలిర్ప॥ ౨౦॥

సీ॥ హురుమంజి పనుల పక్కెరపైని సొంపారఁ బారసీకపు పట్టుపల్లమమర।
జిగి పెంపు రతనంపు మొగపట్ట మెఱుఁగొప్పఁ గొప్పు తళ్కుల పాగ కొనబు మీఱ।
దుగవంకన కలంకమగు నంకవన్నెలు పన్నెలుఁ గుల్కు ముప్పసరు లెసఁగ।
శిరమునఁ బీలికుంచె తురాయి పొలుపొంద పొందళ్కు పాదనూపురము లడర।
తే॥ గీ॥ ఖడ్గ ఖేటక తూణ శార్ఙ్గములను భయ। పార్శ్వముల నొక్క సాహిణి బన్నియనుప।
మునివరానీత ధవళాశ్వమును నరేంద్రుఁ। డెక్కె నుచ్చైశ్శ్రవము నెక్కు నింద్రుపగిది॥ ౨౧॥

కం॥ వందిజనంబందం దన। మంచగతి నొప్పియ రాజమార్గంబున నా।
నందముతో ముందర భట। బృందము తనుఁ గొలువ నగరు వెలువడి యంతన్॥ ౨౨॥

చం॥ క్షితిపతి మెల్లనన్ దఱటు చేసిన నత్తురగోత్తమంబు తా।
ద్రుతగతి నై చలచ్చపలరూపునఁ జాపవిముక్త మార్గణా।
కృతి నుడువీథిఁ బర్విడు ఖగేంద్రము రీతి మరుత్తరశ్చర।
త్సితఘనఖండమట్లు బఱచెన్ ఖురజోద్ధురజోవృతాధ్వమై॥ ౨౩॥

పంచచామరం॥ ఘుళంఘుళాయమానకంఠఘంటికావిరావమై।
ఝుళంఝుళంనినాదపాదసక్తనూపురాద్యమై।
ధళద్ధళత్ప్రకాటికాగ్రధూతకేసరాంకమై।
హళాహళిన్ సమీర వేగమత్తురంగ మేఁగఁగన్॥ ౨౪॥

కం॥ ప్లుతవల్గిత రేచిత ధో। రిత కాస్కందితముల నెడుపృథుగతుల సమం।
చితచతురతనయ్యశ్వము। నతిదూరముఁ బఱపి నెమ్మినరుగుచు నెదుటన్॥ ౨౫॥

మ॥ అచలాభర్తగనెన్ మునిప్రికరదత్తానర్ఘ దేవార్ఘ్యతో।
యచిరాసేచనలబ్ధపుణ్యఫలశంకాపాదిశుంభత్ఫల।
ప్రచురానమ్రనవామ్రకమ్రవిటపప్రభ్రామ్యత్సుకానీకస।
ద్వచనాళీప్రకటీకృతార్థనిగమాంతం బాశ్రమోపాంతమున్॥ ౨౬॥

శా॥ అంతేవాసికృతాగమాంతపఠనంబారబ్ధదేవార్చనా।
త్యంతోద్గీర్ణసహస్రనామకమునిత్యాజ్యాదిహోమక్రియా।
సంతుష్టోజ్వలనంబుశీఘ్రఫలితశ్యామాకనీవారసం।
క్రాంతంబైకనుపట్టెగాలవమునీంద్రస్థానమాతేనికిన్॥ ౨౭॥

మ॥ అలరెంగెంజివురాకుపెన్దెడలతోనాడీర్ఘశాఖాభుజాం।
చలచంచత్కలికాక్షమాలికలతోసారంగగానాగమం।
బులతోఁబొప్పడిబూఁటితోఁదరునరంబుల్ మౌనిసమ్రాట్సమం।
పొలుపొందోలవవర్థితంబులగుటన్ దాద్రూప్యమున్ దాల్చెనా॥ ౨౮॥

కం॥ చుంబితశుకశిశుకబిడాలంబుతరక్షువ్రజోపలాలితసారం।
గంబావృతభుజగమయూరంబగుచుఁదదాశ్రమంబు రాజిలెనరుదై॥ ౨౯॥

సీ॥ హరిణశాబములుజిహ్వాపల్లవములచే మునికుమారులపదంబులుస్పృశింపఁ।
గ్రతుశాలికావినిర్గతహోమధూమమధిభ్రాంతిఁగనిమయూరంబులాడ।
ఘనవాయసాసుముల్ వనభూతబల్యర్థముక్తాన్నకబళములూర్జిఁగిమెసవ।
స్థండిలన్యస్తకాషాయంపుమడతలనెత్తిదుప్పిపిల్లలునిదురఁబోవ।
తే॥ గీ॥ ఫలసమిత్కుశకుసుమాదిభరితమనుప।మాంబుపూరితపద్మాకరంబునగుచుఁ।
దనరినతగాశ్రమముఁజొచ్చెధరణివిభుఁడు।సంభ్రమాశ్చర్యములుమదిసందడింప॥ ౩౦॥

కం॥ క్రొమ్మెలఁగనుంగొనియెనుజన।పాలుండనపాయనియమపరిణతమేధున్।
పాలితసాధుసుబోధున్।గాలవమునినాథుసామగానసనాథున్॥ ౩౧॥

చం॥ కనితురగంబుడిగ్గికుతుకంబుననద్ధరణీశుడత్తపో।
ధనునకుఁదత్సమీపగతతాపసకోటికిభక్తియుక్తిగం।
దనమొనరింపస్వస్తివచనంబులదీవెనలిచ్చియంచితా।
సనమొసఁగన్వసించివిలసద్వినయంబునవారికిట్లనున్॥ ౩౨॥

ఉ॥ మీరుమహానుభావులరుమీమహిమంబులగణ్యముల్తపః।
పారగులారలోకనుతపావనభవ్యచరిత్రులారమీ।
భూరికృపాకటాక్షపరిపూర్ణతగల్గుటనే భవత్పదాం।
భోరుహసన్నిధానమునుఁబొందితిధన్యుఁడనైతినెంతయున్॥ ౩౩॥

ఉ॥ నావుడు రాకుమారు వచనంబుల కమ్ముని సంతసింపుచున్ ।
దా వచియించె నిమ్మధుదినంబులు సర్వమఖక్రియార్హముల్ ।
గావున సర్వతోముఖ మఖండఫలప్రద మాచరించెదన్ ।
క్ష్మావర? నీవు తత్క్రతువుఁ గావుము విఘ్నము వొందకుండఁగన్ ॥ ౩౪॥

కం॥ అనినియమించిన జనవర । తనయుం డటుగాచియుండఁ దత్క్రతువిధిక ।
మ్మునివరుఁడు దీక్షఁ గైకొని । ఘనులగు ఋత్విజులఁ గూడి గావించు తఱిన్ ॥ ౩౫॥

చం॥ ఒకఁడు మృగేంద్రరూపమున నొక్కఁడు బెబ్బులిరూపుఁ దాల్చి వే ।
ఱొకఁడు రుభల్లుకంబుగతి నొక్కఁడు భీకరసూకరాకృతిన్ ।
ప్రకటమహాస్వనంబు లడరంగ నరాళకరాళదీర్ఘదం ।
ష్ట్రిక లెసఁగన్ దదాశ్రమముఁ జేరిరి క్రూరసురారు లొక్కటన్ ॥ ౩౬॥

శా॥ ఆరీతిన్ జను దేరఁ బుత్విజులు శాలాభ్యంతరాగ్నిక్రియా ।
ప్రారంభంబులు మాని భీతి మెయిఁ గంపంబొంద నధ్వర్యుఁడా ।
హారావంబు లొనర్పఁగా వెఱవకుండం చున్ రణోద్యుక్తుఁడై ।
యా రాజన్యకుమారుఁ డయ్యెడ నవార్యంబైన శౌర్యంబునన్ ॥ ౩౭॥

చం॥ తురగము నెక్కి చాపమునఁ దూపుల నేపునఁ గూర్చి ధైర్యవి ।
స్ఫురదురులక్ష్యలాఘవవిశుద్ధు లెసంగఁ దొలంగ కామహా ।
సురకుహనావిడంబమతిసూక్ష్మజవమ్మున నమ్ముగాఁగని ।
ష్ఠురశరజాలముల్ బఱపుచున్ గవిసెన్ గొనయంబు మ్రోయఁగన్ ॥ ౩౮॥

శా॥ క్ష్వేళాఘూర్ణితదిక్తటంబు కుహనాసింహంబు జంభారిదం ।
భోళిస్పర్ధినఖాంకురంబులఁ గరంబున్నుగ్గుఁ గావించుచున్ ।
వ్యాలోలద్రసనారుణాగ్రవివృతాస్యంబై మహీజానిపైఁ ।
గీలాడించినజంత్రమట్లు ఱకలంఘించెన్ బలోదగ్రతన్ ॥ ౩౯॥

ఉ॥ కింక దలిర్పనట్లుగమకించిన సింగఁపు రక్కసున్ మహా ।
హుంకృతి మీఱఁగే డెమున నొడ్డుచు దక్షిణపాణిచేత న ।
భ్రంకషధాళధళ్యరుచిరాజిధురీణకృపాణ మెత్తి యే ।
ణాంకకులుండ తం డుదుసుమాడెఁ బ్రమత్తతదుత్తమాంగమున్ ॥ ౪౦॥

కం॥ గొబ్బునఁ గ్రేళ్ళుఱుకుచు మెయి। గబ్బునకున్నొఁగు దంశగణ మొలయంగా।
నబ్బురపు బొబ్బరింతల। బెబ్బులి పొలదిండి దండి విభుపైఁ గదిసెన్॥ ౪౧॥

చం॥ కదిసిన వారువంబుఁ బెడఁగా నుతికించి మఖవ్రజప్రభుం।
డొందవి నరోషవిస్ఫురణ నొక్కవడిన్ సెలవింట నిష్ఠుర।
ప్రదరముఁ గూర్చి యేసె నుదరంబదరన్ భిదురంబు దాఁకిన।
ట్లెదవిదళించి పోభయకృదీక్షణమా కపటంపుఁ గ్రోల్పులిన్॥ ౪౨॥

కం॥ భల్లూకరాక్షసుఁడును ప్ర। ఫుల్లారుణనయనుఁడగుచు భోడనరాభూ.
వల్లభుఁ డొకభల్లమునం। దొల్లిఁటియట్లనె వినిర్జితునిఁ గావించెన్॥ ౪౩॥

మ॥ శరకుంతక్షురికాదిసాధనవిశేషప్రౌఢి నిట్లా నిశా।
చరదోర్దర్పమడంచి మానులు సురల్సంతుష్టులై మెచ్చన।
ధ్వరము న్సాంగముగాఁగఁ బ్రోచి ముదితస్వాంతంబుతో నుండ భూ।
వరుతో మార్కొనె సూకరాసురుఁడు దుర్వ్యాపారమే పారఁగన్॥ ౪౪॥

సీ॥ ఘుర్ఘురధ్వనులీనఘోషించి సటలుబ్బఁ గొమ్ములనశ్వంబుఁ గ్రుమ్మిగ్రుమ్మి।
వేటుకోలందికి వెసనందకం దినట్ల పరివేల్పొం డెపకరిగియరిగి।
కుఱుఁగట నుండి కన్మోఱఁగించి పవ్వగాఁ దోలఁగి యొక్కొకచోట నిలిచి నిలిచి।
బిరబిరఁ బరువెత్తి పెనఁగి పైకొని డాసి బెదరి పెన్బొదలలో నొదిగి యొదిగి।
తే॥ గీ॥ గట్టుపుట్టయనక యిట్టట్టుఁ ద్రిప్పలఁ। బెట్టి బెట్టి దంపుముట్టచిప్ప।
మట్టిబిట్టు జిమ్మిగుట్టు నన్నృపుఁ బట్టిఁ। బట్టిచలముఁ బట్టి కోటఁ దలఁచి॥ ౪౫॥

లయగ్రాహి.

వంచనగతిన్మిగులఁ జంచలమతిన్ బొదలఁగం జెలసుదూతిసము దంచితరవంబున్।
మించి యొనరించి కడుఁ బొంచి మెయిఁ బెంచి జడిపించి మఱపించి యలయించి బలుతీవిన్।
జించి తరుసంచయముఁ గుంచితముగాఁగఁ బఱపించి సడలించి పెకలించి బహుదూరం।
బెంచి మఱలించి బురణించి కనుపించి కికురించి కుదియించి గమనించి కిటి మించెన్॥ ౪౬॥

కం॥ దానవదగ్రుఁడగు కిటి। దానవుఁడుగ్రుఁడయి జవనిదానవరగతిన్।
దానవలీలఁగ విసెడెం। దానవసుమతీధవుండుఁ దలఁకకకడఁకన్॥ ౪ ॥

కం॥ పటుదంష్ట్రానిహతాశ్మ। చ్ఛటననలకణంబులొలుకఁ జనుదెంచెడున।
క్కిటి దైత్యుమేనఁదూపా। క్కటిమిక్కుటమగుచుఁ బ్రక్కగాడఁగ నేసెన్॥ ౪౮॥

కం॥ ఆయమ్ము తీవ్రగతియై। యాయమ్మున నాటి పాటితాస్థికమై బ।
ల్గాయమ్మొనర్ప నొచ్చిన। కాయమ్మున నెత్తురొలుకఁ గడువడిఁ బఱచెన్॥ ౧౬

ఉ॥ బరువడిఁ బర్వఁ దోడ నెన్నఁ బ్రసరుండునుఁ గూడ ముట్టిభూ।
ధరవనదుర్గసాగరనదంబుల నేకములుత్తరించి త।
ద్గురుహయమే సహాయముగ దూరమునం జని కాంచెఁ జుంబితాం।
బరశిఖరోల్లసన్మణిసమాజము రోహణశైలరాజమున్॥ ౧౭॥

సీ॥ తతశిఖామరకతద్యుతుల దూర్వాంకురశంక మేయఁగ నెలజింక గఁగురఁ।
గటకగారుడములఁ గన్గొని భీతిమై రవిరథభుజగరజ్జువులు జార।
నమితేంద్రనీలగండములకభ్రభ్రాంతిని మెపరీసుప్తోద్ధహంగులు సుముక।
ఘనవజ్రశృంగాటకములు గింగారఘుటులనుచు దేవస్త్రులు ముసుఁగఁ దొడరఁ॥
తే॥ గీ॥ ప్రకటితాధిత్యకాపుష్పరాగములకు। సురుచిరాగసుమపరిచ్యుతమరంద।
బిందుతృష్ణమిళిందముల్ క్రఁగును మున్న। యున్నగము విన్ననువు మెచ్చె నవనివిభుఁడు॥

చం॥ పవిధారం దగినట్టి చట్టుపలు పైపై రాయిడిం జిందునైం।
దవబింబామృతబిందురాజిఁ బునరుత్పన్నంబులై యుత్కటా।
చ్ఛవులం గార్కొనెనో యనంగ గిరిపార్శ్వచ్ఛన్ననీరంధ్రవే।
ణువనంబుల్ శుకపర్ణపర్ణతతులం దోఁచెన్ నృపాగ్రింబునన్॥ ౧౯

ఉ॥ రంగదహార్యశృంగనలరాగవిభాగలరాగయై వియ।
ద్గంగతరంగపంక్తి దవుదవ్వుల మింట ననంతదీప్తియై।
య్యెంగురుచిత్రలీలగ గనేందిర దాల్చినయింగిలీకపున్।
రంగు తెలుంగునం గడుహరంగగు చీరచెరంగులో యనన్॥ ౨౦॥

తే॥ గీ॥ తరణికిరణోష్మఁ గరఁగియి ధ్మములఁ దొరఁగి। వజ్రఫలకమ్ములంటి జవ్వాది వలచు।
తీవె యిండులు కానన దేవతాళి। కేళికాశాలికలభంగి గిరిఁ జెలంగె॥ ౨౧॥

కం॥ సల్లకిపల్లవములు దిన। నెల్లెడఁ దుండెములు సాచు నిభములరొద భీ।
తిల్లు తెలిజల్లిమెకములు। జల్లులు రెల్లుల్లస్లిల్లుచాడ్పునఁ దోఁచెన్॥ ౨౨॥

సీ॥ పైదట్టముగ వ్రాలు పరువంపుఁ జంపకప్రసవాళులనఁగ భర్మమయితటులు।
తటులందు వెదురుముత్యముల నెత్తములాడు చెంచుగుబ్బెతల దీపించు పొదలు।
పొదలపైఁ బొదలు నంబుదముల్ గర్జింపఁ దొలిమొల్కలెత్తు వైదూర్యమణులు।
వైదూర్యమణుల రేవలకుల్కి మింటఁ గట్టని తోరణంబులై చను శుకములు॥

తే॥గీ॥ శుకములకుబింబికాఫలస్ఫూర్తిఁ దెలుపు। పొలుపుగలవాతెఱలవేలుపుంజెలులునుఁ।
గలిగివిలసిల్లునమ్మహాచలముపజ్జ। ధరణిపతివెంట రాఁగిటిదానవుండు॥ ౫౬॥

ఉ॥ చీకురువాయిచిమ్మెటలుజీబనిమ్రోయఁగగబ్బిడాయిపై।
స్రాఁకలగబ్బులుబ్బమునుముంగిఁటమర్కటకీటనిర్మితం।
బైకనుపట్టుమగ్గములనంటినపాఁపపొరల్చలింపఁగాఁ।
జీకువలన్నునోయనుచుఁజెన్నగునొక్కగుహాంతరాళమున్॥ ౫౭॥

ఉ॥ తూకొనినన్ మహీపతియుఁదోడనెతద్గుహఁజొచ్చిడాయఁగా।
నాకిటిదానవుండునిబిడాంజనపుంజములంచయుంచుపెం।
ఱీకఁటిలోనడాగివెతచేతనపృచ్ఛ్యతనొందఁబిమ్మటన్।
రాకొమరుండుధైర్యమవరంజనయొన్నవిలోననొంటిగన్॥ ౫౮॥

కం॥ క్రౌంచవివరంబువెలుగడుగంచపగిదిఁదన్మహాగుహాచరమద్వా।
రాంచలమునిజసితాశ్వము। పంచితగతిఁగడచినడువనధిపునకెదుటన్॥ ౫౯॥

సీ। ఏలాలతాజాలడోలాకలితకీరబాలాస్ఫాలాలాపలాలితంబు।
మందారమాకందబృందామితమరందసందోహానందితేందిందిరంబు।
ఝల్లీకుచోల్లీఢమల్లీలసద్గుచ్ఛవల్లీమతల్లీపరివేల్లితంబు।
పారావతనటన్మయూరారాతలకిశోరవారాంకితారవోద్గిరణంబు॥
తే॥గీ॥ మానితానూనపికకాకలీనినాద। లీనకాననదేవతాగానజాయ।
మానసూనప్రియాళుప్రతానలీన। పీనరుచిరైనయొకకానకాననయ్యె॥ ౬౦॥

సీ॥ మాతులుంగలవంగమందారజంబీరపంచనపిచుమందపసాలతాల।
కురువకభల్లాతకోవిదారకపంబకరవీరఖర్జూరకనకపనస।
బదరీపకుశనాగభంగకేపున్నాగకపిళ్థప్రియాళుమాకందకుంద।
మాధవీతిక్కోలమునిపకహింతాలవంజుళశింశుపావటమధూక।
తే॥గీ॥ కుటజమోరటభండీలకులకకలిమి। కాంచనావ్యాయకాండేక్షుకారవల్లి।
నారికేళాదిభూరుహవారములను। కనులపండువనొండెడికాననంబు॥ ౬౧॥

వ॥ అట్లుపొడచూపినవవ్వనప్రాంతంబవనీకాంతుండుడాయనచ్చెంతలననంతహ
సంతికావాసంతికాక్రాంతవకులతర్వంతరనిరంతరదంతురలతాంతనిష్క్రాంతఘుమఘు
మాయమానసుగంధబంధురగంధవాహకిశోరవిహారంబులును, హారమౌక్తికవ్రాతంబుల

చెన్నునఁ జెన్నలరు క్రొన్నిగ్గుమొగ్గల నెలకొన్న పొన్నగున్నలమిన్నలము క్రొన్ననలసన్నపు
పొప్పొడులయొప్పునఁ గుప్పతెప్పలైయనంటి పొరలనుప్పతిల్లు కప్పురంపుదుమారమ్ములమరుం
గుపడునీరంబులును, నీరంధ్రతతమతమాలద్రుమసముదయతమోవిమోచనసమర్థద్యుమణికి
రణాయమానంబులగునశోకానోకహకుసుమగుచ్ఛంబులవలనజలజలనఁ జిలుకునలరుబలుదే
నెసోనలకు వానకోయిలల చెలువునఁగలయమెలఁగునలికులంబుల కలఝుంకారంబులకను
సారంబులగుసమీరపూరితవేణురంధ్రనిర్గతనిస్వనంబులునుంగలిగివివిధతరులతాజాలంబు
నకాలవాలంబును, మధురఫలసముదయంబునకుదయంబును, సుగంధకుసుమప్రకరంబు
నకాకరంబును, శృంగారలతాభవనంబులకుఁగులభవనంబును, శుకపికప్రముఖసకలశకుంత
వారంబునకాధారంబునుఁ, గెంపుసొంపులనింపారుచివురుజొంపంపుఁబట్టులకువిడిమట్టు
ను, గంబురాపచ్చికస్తురితట్టుపునుంగులతావులకుఁదావును, చలువనెలరాలచెలువులకు
నెలవును, మావిమోకలతీవికిదీవియు, తలిరాకులతేటకుమూటయునైనేనీటలరి, ముగు
దపగిదినవవయోవిలాసంబునంజెలఁగి, ఋతుస్నాతరీతినాతతహరిద్రాంకంబులందనరి, బా
లింతపోలికలాలితప్రసవసంపదంబొనరి, యింద్రజాలంబుచందంబునవిచ్చుమొగ్గలనె
సఁగి, శుభవస్తుప్రభవవిభవాభిరామంబగునయ్యారామంబారామపట్టాభిషేకసమయం
బునుంబోలెఁబ్రశోభితభూమిజాశేషశాఖామృగకాండంబై, కాండంబునుంబోలెనూ
త్నపత్రసుందరంబై, దరంబునుంబోలెబహులార్జునప్రభామహిమంబై, హిమంబునుం
బోలెనసహమానఖగరాజోదయంబై, రాజోదయంబునుంబోలెసంభరితసారంగంబై, సా
రంగంబునుంబోలెనధిగతమహీభృత్సన్నిధానంబై, నిధానంబునుంబోలెఁగనకరత్నాగ్ర
జన్మంబై, యగ్రజన్మసముదాయంబునుంబోలెగాయత్రీజపాసక్తాలోకంబై, లోకంబునుం
బోలెవర్ధమానసకలప్రాణిచయానందకంబై, నందకంబునుంబోలెమాధవాలంకృతంబై,
మన్మథావేష్టితంబయ్యునునీలకంఠసమన్వితంబై, దేవవల్లభవిరాజితంబయ్యునుబహుళ
పలాశోదంచితంబై, వితతకీచకసంవృతంబయ్యునుసంతతానిలడింభకసంచారంబై, పూత
నారమ్యంబయ్యునుఁగృష్ణసారప్రకాశమానంబై, కుంభజాతస్ఫురితంబయ్యునువిజృంభి
తమహావీరద్రుపదంబై, గంధర్వసేవితంబయ్యునుగంధర్వసేవితంబై, లలితోత్కలికాకలి
తదివ్యమహిళాగణంబయ్యును లలితోత్కలికాకలితదివ్యమహిళాగణంబై, సుమధురసా
లాన్వితంబయ్యును సుమధురసాలాన్వితంబై, వానప్రస్థనివాసంబయ్యునువానప్రస్థని
వాసంబై, ప్రకాశింపుచుండఁదదీయమధ్యప్రదేశంబునందురగంబునడుపుచుంజనుమం
డెనాసమయంబున॥ ౬౨.

సీ॥ పూచినసునుఁజిన్ని పొన్నగున్నలచేతవిరిసినమొల్లపందిరులచేత।
పండి తేనియలొల్కు పనసమ్రాకులచేతననిచినసంపంగికొనలచేత।
మకరందములుజిందువకులపంక్తులచేత భుగభుగవలచుపుప్పొడులచేత।
పొరలఁగప్పురములొప్పుననంటిగమిచేతపన్నీటివఱదతుంపరలచేత॥
తే॥ గీ॥ మించునొకకేళివనగమ్మతెమ్మెరలువీవ।సురుచిరానంతరత్నమందిరముచెంత।
సంతసముగూడఁబుష్పవృక్షములనీడ।నళులుమ్రోఁతులీననసుఁగునెచ్చెలులలోన॥ ౬౩॥

సీ॥ చన్నిచ్చుహరిణులసగముగ్రోలుకిశోరనివహంబులునుజెంతనిదురఁబోవ।
నలఘుమూర్ఛనలచొప్పలించునసుఁగువిస్తములుచిత్తరువులయందంబునొంద।
తానున్నచంద్రకాంతపువేదిగరఁగిపాదాలక్తకములంటిజాలువార।
రాగసంగతిఁజొక్కుసోఁగకన్గవనీటులరమోడ్పుపద్మములతెఱఁగుఁజూప॥
తే॥ గీ॥ మించువెలువూనివీణవాయించుదాని।దానికిలలోనిచెలులెనరానిదాని।
దానినడకలదానిఁగడానిబొమ్మ।వోనియొకమానినినిధరాజానిగనియె॥ ౬౪॥

కం॥ అతఁడటుగనితతశంపా।లతయోధృతజీవకనకలతయోవనదే।
వతయోయనియరుదందుచు।లతికావృతిమాటునకుదొలఁగిమదిలోనన్॥ ౬౫॥

వ॥ తానువిష్ణ్వంశసంభవుండగుటంజేసియిట్లనివితర్కించె॥ ౬౬॥

సీ॥ ఈపద్మపాణిఁజేదఁగూర్పఁజాలినపురుషోత్తమునిదెసూభోగగరిమ।
యీయార్యనెమ్మేననెనసినరాజశేఖరునిదెసూవెభాసురవిభూతి।
యీహంసయానతోనెసఁగుసఖ్జాధినాయకునిదెసూచిరసుకృతమహిమ।
యీనవపద్మినితోననురక్తినొందినయినునిదెసూవెసునతపంబు॥
తే॥ గీ॥ గనివినియెఱుంగమిమ్ముజ్జగములనున్న।నరగరుడసిద్ధసాధ్యకిన్నరసురాహి।
రాజకన్యకలందునీరాజవదన।కెనయగుమిటారినిదియెమారునికటారి॥ ౬౭॥

ఉ॥ మించులమించులన్మఱియుమేల్మిపసిండియుఁజంద్రుసారము।
జ్ఞాంచితసౌరభంబునివియన్నియునొక్కటమేళవించియు।
కాంచనగర్భుఁడాత్మమతికౌశలమందరుమెచ్చదీనిని।
రించెనొకాకయిట్లునెఱిమించునెయీమెయిచాయయేయెడన్॥ ౬౮॥

కం॥ ఈరమణిచరణసంగతిఁ।గోరిపునర్భవతఁగాంచిగోరులనఁగఁబెం।
పారెనటుఁగాకయుండినఁ।దారకలేరీతిసత్పదస్థితినమరున్॥ ౬౯

కం॥ తదుపరిపదవిజితమగుట।నొదిగొందగువారిఁ జేరియునుఁ దాఁ బేర్లై।
యిదియన్నతమేనికమతం।బదిముడుచుట యేలభీతినఖిలాంగంబుల్॥ ౨౦॥

కం॥ కలమోదరములుఘనసే।తులసత్ క్షేత్రమునఁదపముఁదొలిఁ జేసిగదా।
చెలిజంఘులకెనవోలెను।ఫలసిద్ధిఁ జెలంగకున్నె వరశాలులకున్॥ ౨౧॥

తే॥ గీ॥ కరికరంబులమానంబుకదళిజిగియు।కరభములసౌకుమార్యమికలికితొడలు।
గైకొనఁగమలినతయుద్వృక్కృతినతయును।జిన్నతనమునునవియొజఁ జెందుచుండె॥

ఉ॥ ఆకమలాసనుండుదనుజాపహృతంబగు నేమొ వెండియున్।
శ్రీకమనీయమైనధరణీవలయంబనితన్ని జాంకమీ।
స్త్రీకటిచక్రసీమగసృజించిమణుంగునఁడాచెఁగాకర।
త్నాకరమేఖలాంకవిపులాకృతియైయదియేలపొల్పగున్॥ 23॥

కం॥ ఉన్నదియొలేదొయనఁదగు।కన్నియ నెన్నడుమువిన్నుగాఁ బోలును గా।
కున్నను రోమావళిరా।హూన్నతనీలరుచులచటనుండఁగనేలా॥ ౨౪॥

చం॥ తృణమగువిల్లిదేటికనియిక్షుశరాసముడించివేణికా।
గుణయుతమైనయీకుసుమకోమలికోమలగాత్రవల్లిసిం।
గిణిగనొనర్చికొన్మరుఁడుకేలనుఁబట్టఁదదంగుళీనిక।
ర్షణభవరేఖలొప్పెననరాజిలుబిత్తరమైనముత్తరుల్॥ ౨౫॥

కం॥ ఘనజఘనంబనుపులినం।బునఁబొడమిన పొన్నగున్న పూవనఁదగునా।
సినినాభియారుతదా।సనకైయరుదెంచునళులచాల్గాకున్నే॥ ౨౬॥

సీ॥ నాభీనదమునుండినడుమనుమింటిపైఁగవగూడియెగయుచక్రంబులేమొ।
స్ఫురదురోలావణ్యసరసిజనించినమొనచూపుపొందమ్మిమొగడలేమొ।
నవవయోలక్ష్మియీయువిదపొందూనికానుకయిడ్డరత్నకందుకములేమొ
వరతనూశృంగారవనములోవిహరించుమనసిజకుంభికుంభంబులేమొ॥

తే॥ గీ॥ ప్రకటరోమావళీలతాగ్రప్రభూత।సరసవిలసితసుమగుళుచ్ఛంబులేమొ।
తిన్ననయిసిబ్బెములవన్నెఁ జెన్నుమిగిలి।యొన్నఁదగియున్న చెలిగబ్బిచన్నులేమొ॥

మ॥ తతముక్తామణిహారనిర్ఝరపయోధారల్ స్తనస్వర్ణప।
ర్వతభాగంబులఁబుట్టికాంచనరుచిన్వ్యాపించిపెన్సోగలా।
లతలానీలతకూనచొక్కమగుకేల్గావేనిబాలాంగుళీ।
గతచంచన్నఖపుంజఁ పుంజివురుమొగ్గల్పుట్టనందేటికిన్॥ ౨౮॥

కం॥ కుందనఁపుందళుకందము। క్రిందుపడం దనరు సుందరీకంధరమా।
చందనఁపుం దెలు సొందుచుఁ। జిందము పొందూనుఁ జర్చ సేయందరమే॥ ౨౯॥

సీ। తమలోఁ శ్రవణభూషణములు దోఁచుటఁ గపోలములు క్రొమ్మించు టద్దములు గావె।
నెమ్మని నెఱతావిఁ గ్రమ్మరించుట మోము నవ్యఫుల్లారవిందంబు గాదె।
లలిసువర్ణంపుఁ గమ్మలసొంపుఁ గనుటచేఁ గర్ణముల్ శ్రీవర్ణకములు గావె।
మొనచూపు చూపుతూపులఁ జిమ్ముచుంట వంగి చెలంగు బొమలు సింగిణులు గావె॥
తే॥గీ॥ విబుధసంవేద్యమహిమ మై వెలయుచుంట। లలన మృదువాక్ప్రతతి సుధాలహరి గాదె।
యీజగన్మోహినిని సృజియించినపుడు। ధృతి దరలకున్నె మతి శతధృతికి నైన॥ ౩౦॥

తే। గీ। వదనముకురంపు బరణిలో మదనుఁడనుప। పల్లవము వోలె వెలికిఁ గన్పట్టుచున్న।
రదనవరహీరమాలిక తుదఁ దనర్చు। నాయకంబనఁ గెమ్మోవి నారికొనరు॥ ౩౧॥

కం॥ నలినము నుశంకనళులీ। లలనా వదనంబుఁ గ్రమ్మి లావణ్యరసా।
వళిఁ గ్రోలకుండుటకునై। నలువట గంధపలి నిలిపెనా నాసదగున్॥ ౩౨॥

కం॥ దరహాసచంద్రికాభ్రమఁ। దరుణీమణివిమలముఖసుధాకరబింబాం।
తరమున వ్రాలుచకోరక। వరయుగమనఁ గన్నుఁ దోయి వలనొప్పారున్॥ ౩౩॥

ఉ॥ మంగళలీల ఫాలతటమండితమండననీలరత్నరా।
జింగికురించి వక్త్రసరసీరుహసౌరభవీచికాచర।
ద్భృంగములో యనంగ వినుతింగొనుచుంగొన చామెఱుంగులం।
బోఁగి చెలంగు నుంగరఁపు ముంగురులంగనకుంగనుంగొనన్॥ ౩౪॥

తే॥ గీ॥ మౌళిమాణిక్యరుచితటిన్మంజులంబు। రుచిరనవరత్నసీమంతరోహితంబు।
నైన యీమోహనాంగి సోయగఁపు నీల। కచము ఘనవిభ్రమస్ఫూర్తిఁ గాంచుటరుదె॥

సీ॥ ఉరుకచ్ఛపవిలాసము పరిపాటిములందు వరనీలరుచికచస్ఫురణయందు।
పద్మరేఖాస్ఫూర్తిపాణులందును మహాపద్మసారూప్యంబు వదనమందు।
శంఖవైభవము రాజత్కంఠతటియందు మకరవిభ్రమము జంఘికలయందు।
గురుముకుందాసక్తి సరసచిత్తమునందుఁ దగుకుందలీల దంతములయందుఁ।
గీ॥ గలిగి విలసిల్లునట్టుఁ గాఁగ మలభవుఁడు। నవనిధుల నొక్కయెడఁ గూర్చియు విదరూప।
ముగ సృజించెనయా రెయీముద్దుగుమ్మ। మనసుఁ గొనువాని రాజరాజనఁగ వలదె॥ ౩౫॥

కం॥ అని యిట్లు మదిని విస్మయ। మెనయఁగ నయ్యన్న మిన్న నెన్నుచు దరియం।
జనితత్రపాతిశయంబున కానందాబ్ధిఁ దేలి మునుఁగుచునుండెన్॥ ౩౬॥

కం॥ అని మార్కండేయమహా। మునిక్రోష్టికిఁ జెప్పినట్లు ముదమునఁ బక్షుల్
వినుపించిననపుడా జై। మినియవ్వలికథనుఁ జేర్చి మెయినడుగుటయున్॥ ౭౮॥

చం॥ పరమపవిత్రగాత్రపురభంజనకుంజరకోణపాంతకా।
గరళగళాకళానిధిసుకల్పితగోళకమాళిపాళిస।
త్కరకరుణాలవాలగిరికార్ముకధార్మికమానవావనా।
నిరుపమసత్యనిత్యవరనిశ్చలతామహితప్రవర్తితా॥ ౭౯॥

కం॥ బ్రధ్నాబ్జవహ్నిలోచన। బుధ్నప్రజ్ఞాననిపుణబుధ్నకేశసఖా।
గృధ్నామరరక్షయహీ। స్బృధ్నజగత్సృష్టివృక్షబుధ్నసులక్ష్యా॥ ౮౦॥

కందగర్భితమణిగణనికరవృత్తము॥

సురనరవరశివసురుచిర, వరణా। వరగుణహరిశరవసుపతిశరణా।
స్మరహరభవహరసమరస, నిరతా। నిరుపమపురహరనిజసుఖమహితా। ౮౧॥

పృథ్వీవృత్తము॥ ముదాకరసదామరప్రకరమోక్షకృల్లక్షణా।
సదాశివహృదంతరప్రవణసచ్చిదామోదదా।
విదారణసుదారుణప్రతిభవిక్రమాశుక్రమా।
నదీపతిసుదీపితప్రథితనందితానారతా॥ ౮౨॥

మాలిని॥

సకలసుగుణజాలాసంవిదామేయలీలా। ప్రకటనిరతహేలా పార్వతీచిత్తలోలా।
సుకరసుజనపాలాశోభితాత్మైకఖేలా। నికటభజనశాలానిర్మలామోదశీలా॥ ౮౩॥

గద్యం.

ఇది శ్రీమదిమ్మానేన్యన్వయపయఃపారావారరాకాసుధాకరానవరతదేవబ్రాహ్మణపూజావిధేయదిగంతరాక్రాంతయశఃపరిపూరితశ్రీబాపనార్యపౌత్రవీరేశలింగనాయకపుత్రశ్రీమద్గౌరీరమణచరణారవిందామందమకరందపానతుందిలేందిందిరాయమాణశ్రీదక్షిణామూర్తి రామయోగిగురుప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషాచతురకవితావితానానూనవైభవబుధజనవిరాజమానశరభలింగాభిధానప్రణీతంబైన యలంకారచంద్రోదయంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---



శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

శ్రీ మకరధ్వజ చరిత్రంబను నామాంతరము గల

# అలంకారచంద్రోదయము.

## తృతీయాశ్వాసము.

క౦॥ శ్రీరంజితసచ్చిత్సుఖ। కారణసత్కారణవరకరుణారసహృ।
త్తారణవారణకోణప। మారణమృగయాపురీశ మంజులకోశా॥ ౧॥

తే॥ గీ॥ అవధరింపుము మునిమృకండాత్మజుండు। క్రోష్టికి కతిఁగించినట్టు సద్గోష్ఠినమరు।
జైమినికి నెమ్మనమునకు దుసంత సిల్లఁ। బక్షిరాజంబులిట్లు చెప్పందొడంగె॥ ౨॥
వ॥ అట్లు మకరధ్వజభూభుజుండా సుందరీతిలకంబుఁ దిలకించు నెడ॥ 3॥

చం॥ పదములనానియయూరువులఁ బాటినితంబము నాటి నాభికిన్।
బొదలి వళిత్రయంబె నసి ముద్దిడి నిద్దపుటాస్యంబెక్కెపై।
నుదుటుగ నిప్పు యన్నతపనోహరయుగ్మము నాక్రమించెనన్।
మృదువళిఁ జూచు నృపకుమారుని మోహనదృష్టిజాలముల్॥ ౪॥

వ॥ ఇవ్విధంబున నజస్రసులకనుమానసవాటిలునవాంగి జాక్షి నీక్షించుచు జలధరతిరస్కారణి వెలువడునిందు చందు నినిచందంబున లతాంగిరణంబుగాఁ గనుచియకందర్పశతసుందరుండా సుందరీబృందంబు ముంగర నిలుచునవసరంబున॥ ౫॥

సీ॥ ప్రికటాస్యచంద్రచంద్రికవోలె మొలకనవ్వొలుకువాని ముదంబుఁగులుకువాని।
బలుసోయగముఁ గల్వలఱేని వలఱేని మించువానికడాని మించువాని।
హరినీలనీలాభ నలరారు మీసంపు లీలవాని పసిండిచేలవాని।
నరవిందములకు విందగు కన్నుఁగవ తళ్కులొలయువాని సుకాంతి వెలయువాని॥

తే॥ గీ॥ హారకేయూరకటకకోటీరకుండలాగ్రిమమాణిక్యభాగ్యములవాని।
నప్పుడమిఱేనిపంక్తిలోలాంతరంగ। లగుచుఁగని లేచి నిలిచి రయ్యబ్జముఖులు॥ ౬॥

కం॥ కలయ వెలుఁగొందు రుచిఁ జొ।క్కులమధ్యమునందు నిందుకళవో లెమరు।
ల్లలనారత్నంబనుఁగుం।జెలువలలో నుండి వింత చెలువము దోఁపన్॥ ౭॥

చం॥ తమకమునబ్బురంబును ముదంబు నెదన్ గదియంగ నేత్రప।
ద్మములు ప్రఫుల్లముల్ సలలితంబులు నైచలదృఙ్మిళిందసం।
ఘములను గుమ్మరింపఁగుచకందుకముల్ పులకింపఁగాంచెఁ జే।
మమలరనద్ధరావరకుమారుని నవ్యరమాకుమారునిన్॥ ౮॥

మ॥ తొలుకార్మించులసంచులై కువలయస్తోమైక దామంబులై।
బెళుకుం బేడిసమీలలీలలయి దీప్తిన్ ఖంజనాప్తంబులై।
తెలినెత్తమ్ములతమ్ములై తళుకులై దీవ్యచ్చకోరాళికా।
ళులునై యొప్పఁగఁ గప్పె నప్పుడు నృపాలుం బాలికాపృక్తతుల్॥ ౯॥

ఉ॥ వేలుపువాలుగంటి బొమవింటి విలోలదృగాశుగాళి భూ।
పాలు విశాలవక్షమునఁ బర్వఁగ నయ్యెడ నెంచియించు వి।
ల్గాలుపు దంట వింటఁ బదిలంబుగఁ దుమ్మెదనారి మోయ ప్రా।
యాలి పయింగడంగి కుసుమాస్త్రము లేయఁ దొడంగె నేపునన్॥ ౧౦॥

ఉ॥ కోరిక లూరు నెమ్మొయిగ గుర్వొదుచున్ గడకంటఁ దారకల్।
చేరి పరిభ్రమించు ననుఁ జెక్కులఁ జెమ్మట గ్రమ్మె నెమ్మినో।
య్యారపుఁ జూపు లజ్జ బెరయన్ మగుడున్ వలపూని క్రమ్మఱన్।
వ్వారెకు వెల్వడున్ నృపతినందనుఁ జూచు నెడన్ బడంతికిన్॥ ౧౧॥

కం॥ ఈరీతిఁ గాంచి దివిష।న్నారీతిలకంబు రాజనందను నవశ్రీం।
గారాకారము నకుని।పొరఁగఁడు నెమ్మిచ్చి చొక్కె యాత్మగతమునన్॥ ౧౨॥

సీ॥ తన కాంతి దరహాసమున నిల్వ భూవరుం డగుచు వర్తించు సుధాంశుఁడో కో।
తన దుపద్మాంబకత్వము నుగన్నులఁ దాల్చి సాంగుఁడై మొనయు ననంగుఁడో కో।
తన సౌరభము వక్త్రమున నించి నిజవిలాసముఁ జూపవచ్చు వసంతుఁడో కో।
తన హరిడింభకత్వము మధ్యమునఁ బూని యవనికి దిగిన జయంతుఁడో కో॥
తే॥ గీ॥ గాక యుండిన నీ భువనైకమోహ।నాకృతి యును నీ శుభాంగక సౌకుమార్య।
మీ యతుల దివ్యతేజమీ మృదులశీల। మొనరు చుండునె యొందు నింకొకని యందు।౧౩॥

చం॥ నరసురసిద్ధచారణఫణాధరఖేచరయక్షసాధ్యకి।
న్నరులకుమారులన్ జగమునన్ వెదకంగ నెవీని మేనివి।
స్ఫురణములోనఁ దాంతమునుఁ బోలఁగఁ జాలుదు రేమగుండుమ।
త్వరితచరుండ్రై మెలంగఁ డెయితండకటా నను చెట్టవట్టినన్॥ ౧౪॥

మ॥ కరితుండంబులు బాహుదండములు శ్రీకారంబులౌ కర్ణముల్।
కురువిందాకృతి మోవి రీవి నునుఁ జెక్కుల్ చంద్రఖండంబులన్।
నిరసించున్ హరినీలముల్ నెఱికురుల్ నెమ్మేను మేల్ వ్రేఁడియ।
ద్దిరయౌ జూనినరింపఁగల్గు ననఁగా నేసు న్సుభాగ్యంబిలన్॥ ౧౫॥

సీ॥ అనిమిషత్వంబు ధన్యత నొందఁగా వీని చెలువంబుఁ గోరి వీక్షింపవలదె।
విమలగాంధర్వంబు వినుకెక్కఁగ వీనిపై నిగీతంబులు పాడవలదె।
కులుకుగుబ్బల సౌరు గొనఁబు మీరఁగ వీని దృఢపరీరంభ మర్థింపవలదె।
కమ్మకెమ్మోవి చొక్కఁపుఁ జవులుగ్గి వీని నునుఁ జెక్కు గవముద్దుఁ గొనఁగవలదె
తే॥ గీ॥ విలువఁ జెలుపఁగ రానియీ తలిరుఁ బ్రాయ। మొలసిఫలమంద వీనితోఁ గలసి మెలసి।
వలచి వలపించి తమిఁ బెంచి తలిరువిలుతు। కేళికలఁ దేలి సుఖలీలఁ గ్రాలవలదె॥ ౧౬॥

కం॥ అనియిటు లూహింపఁగఁ దన। యనుఁగుం జెలులందుఁ బ్రౌఢయైతగు కలవా।
ణినయమస్థ రభాషలని। ట్లనియొన్నతుఁ డత పలిర్వనవనీపతితోన్॥ ౧౭॥

ఉ॥ అయ్యమరేంద్ర వనంపనుని యుండమునందగు నీవు నీదుపే।
రెయ్యది మన్కి యైనపుర మెయ్యది యెవ్వరివాఁడ వన్వయం।
బెయ్యది యిప్పుడిచ్చటికి నేగుచు నిచ్చటికేగుదెంచితో।
చెయ్యనఁ దెల్పుమిందరిహయాసన్నిభ వాహనా లోకమోహనా॥ ౧౮॥

వ॥ అనియడిగిక లవాణి నిజవయస్యానుమతంబున రత్నపీఠంబొసంగిన నందు సుఖాసీనుండై న్రు
పసూనుండిట్లనియె॥ ౧౯॥

ఉ॥ ఏను మఖప్రజాధపుఁడ నిందుకులుండ గుశస్త్ర జిన్మహీ।
జానిసుతుండ నొక్క మునిజన్నముఁ గావఁ దలంచి మత్పితి।
స్థానపురంబు వెల్వడి వసన్ననుఁ జెంచిత దంత రాయకృ।
ద్దానవులన్ వధించినఁ బదంపడి యందొకరుండు ఘోణియై॥ ౨౦॥

క॥ కదసిమదీయనిశాత।పృదరాహంతిఋరికియిట్టకుఁబఱతెంచిగిరీం।
ద్రదరిన్గను మోఱఁగినసే। వెదకుచునిటువచ్చినాఁడవినుమబ్జముఖీ॥ ౨౧॥

వ॥ అనిమఱియునద్దివిజకాంతారత్నంబును ద్దేశించియిట్లనియె॥ ౨౨॥

శా॥ శ్రీవాణీగిరిజాశచీరతులఘాతృన్వెందుమబ్బోటుల।
న్నీవామాక్షియొకర్తుగామదికినెంతేసందియంబయ్యెడు।
న్భావంబేర్పడనాకుఁదెల్పుముశరత్పర్వేందుబింబాననా।
యీవిద్యుల్లతికాంగిజన్మకథనంబీబాలికానామముల్॥ ౨౩॥

క॥ అనవుడురాకోమరునకి। ట్లనియెన్గలవాణికాననగునిదెమత్ప।
త్తనముకమలావిలాసం। బనుపేరనశేషసంపదావాసంబై॥ ౨౪॥

సీ॥ ఏపంకఁగనుఁగొనహేమమయోద్దీప్తసుందరతరముతామందిరములె
యేదారవీక్షింపనిభకుంభమాక్తికతోరణాళిపృథుపూరితములె।
యేచాయఁజూచినసినమండలావృతధ్వజచామరచ్ఛత్రవరణతతులె।
యేమూలఁబొడఁగన్నశ్రీమించుదీర్ఘికాప్రాకారగోపురప్రాంగణములె।
తే॥ గీ। యెందుఁబరికింపనందితానందవనము। లెలులఁదలకంపనప్పతిఘటనికాయ।
మేమిచెప్పుదుఁగమలాఖ్యనెసఁగునట్టి।పురమునందునినింద్రుని పురముఁబోలి॥ ౨౫॥

వ॥ మఱియును॥ ౨౬॥

సీ॥ అచటిభూసురకోటియఖిలవిద్యాధాటిఁగమలజుమెచ్చనివిమలమతులు।
నచటిక్షత్రియజాతియతిశౌర్యవిఖ్యాతిఁబరశురామునినైనసరకుసేయు
దచటికోమట్లలకాధినాథునకైనధనరాసులిచ్చెడిధన్యతములు।
నచటినాలవవారుసుచరిత్రగుణభూతిబ్రాహ్మణభక్తిచేఁబ్రబలువారు॥
తే॥ గీ। నచటివేశ్యాంగనల్మించునట్టినాట్య।ముందురంభాదులనురివినింపఁజేతు।
రచటిపొలములుసస్యోన్నతాప్తిఁజెలఁగు।నచటిసకలవస్తువులునవర్ఘ్యమణులు॥ ౨౭॥

మ॥ కలఁడేతత్పురనేతయాతతసమాఖ్యాబాలికాకేళికా।
నిలయీభూతజగత్త్రయుండఖిలవిజ్ఞేతృస్తుతాత్మీయచం।
జ్వలసచ్ఛ్రీనిధవారితారిహిమతేజోఖండమార్తాండమం।
డలుడుండున్పురజిత్సమాహ్వయుఁడుగంధర్వాధినాథుండిలన్॥ ౨౮॥

చం॥ అతఁడుశుభాంగినాఁబరగునాత్మసఖీమణితోడఁజేర్మిమై।
నతులితభోగవైభవమునందుచుమున్నొకనాఁడుకేళికాం।
చితవనులన్నదీపులినసీమలసత్కృతకాద్రికందరా।
యతనములన్ముదంబునవిహారముసల్పుచునేగదవ్వులన్॥ ౨౯॥

సీ॥ లేమిఁబాపఁగనోపులేమపుట్టినయిల్లుపాఁపపానుపుఊనిపడకటిల్లు।
చేసిబ్రాఁకులనీనుపేరైనయెలదోటమైనాకుఁగాచినమరువుకోట।
వెలలేనిమానికంబులపెన్నిధానంబుబహుసుధాహారులపానసంబు।
హరిదిభంబులకేళికలకుకేళాకూళిజలధరావళిపానసదనసాళి॥

తే॥ గీ। పంటకలువకంటిగంటలయొడ్డాణ।ముమిఱుమకరమత్స్యకమఠకర్క।
టాదివాశ్చరములకాస్పదమగుచోటు।కలశజలధియెదుటఁగాననయ్యె॥ 30॥

కం॥ పొడఁగనితత్తీరంబునఁ।బుడమిపడంతుకపిఱుందుపోలికఁగన్ప।
ట్టెడునొకయున్నతపులినము।కడనిలిచియతండుజెలిపెఁగామినికెలమిన్॥ 3౧॥

మ॥ అమరశ్రేణులకోగిరంబునిజకన్యారత్నమున్నారిక।
య్యమరాధీశునకున్సితాశ్వగజముఖ్యంబుల్పయోదాళికు।
త్తమమౌజీవనమిట్లొసంగుటఁజుమీదాల్చెన్యశంబీసము।
ద్రమువిష్వక్చలదూర్మికానికరనిర్యత్ఫేనదంభంబునన్॥ 3౨॥

మ। చటులాంతర్జ్వలదౌర్వకీలములవెచ్చంబ్రాఁగికూలంకషా।
త్కటదుగ్ధంబుగఁబొంగినాగగనవాతక్షిప్తకల్లోలవి।
స్ఫుటవేగంబుననీపయోంబునిధినుబ్బున్మిగడల్మింటిచ।
క్కటికిన్జిడ్డెటిఁగించువాసనలతోఁగంటేకురంగేక్షణా॥ 33॥

సీ॥ మథనవేళాభ్రమిమున్మందరత్వరఁబూనితెరలకున్నవివోలెఁదిరుగుసుళ్లు।
పైనున్నహరితల్పఫణిమేనిమడతలవడువుననిడుపలయ్యెడుకరుల్లు।
పరిభవించుతటినచ్చరలవిలోకనలోలతలనభ్యసించెనాబెళుకుమీలు।
తారలపొందుఁబొందఁగఁబోలెమిన్నందుకల్లోలఘుతపయఃకణచయంబుఁ॥

తే॥ గీ॥ దనరతావకముఖచంద్రదర్శనప్ర।భూతకౌతూహలంబునఁబోలెనతివ।
తెరలియుప్పొంగరవమునఁదేజరిల్లి।పాండురుచులెల్లకడఁజల్లిపాలవెల్లి॥ 3౪॥

కం॥ తమముడిపికువలయానం।దముసంధిలఁజేసిసత్పథక్రమణవిలా।
సముఁగనిసర్వజ్ఞవతం।సమయినరాజిందునూవెజనియించెఁజెలీ॥ 3౫॥

వ॥ అనిప్రియాంగనకౌఁగిలించుచునగ్గంధర్వవిభుండనవిమానంబున॥ 3- ॥

శా॥ ఆనందంబునఁగంఠదేశవినిబద్ధాన్యోన్యహస్తాబ్జులై।
నానారత్నవిభూషణప్రభలుసంధ్యారక్తిమంబూన్పనె।
మ్మేనిగ్గుల్చపలాసితాంబుదములన్మేలంబులాడంగల।
క్ష్మీనారాయణులిర్వురున్విహరణక్రీడావినోదంబునన్। 3´॥

తే॥ గీ॥ మెలఁగుచుండఁగనబ్బురంబలరఁజూచి। తానుఁదనకూర్మిబోటియుఁదత్పదాబ్జ।
ములకుఁబ్రణమిల్లిభక్తినంజలులుఫాల।తలములనుటించివినుతించిరెలమినిట్లు॥ 3¨ ॥

భుజంగప్రయాతము॥ నమస్సర్వలోకైకమాతాపితృభ్యాం।
నమశ్చంపకేందీవరాభాంగకాభ్యాం।
నమోదేవదేవాదిసంసేవితాభ్యాం।
నమోదివ్యరుగ్భ్యాంనమశ్శ్రీహరిభ్యాం॥ 3¯ ॥

వ॥ అనిమతియునయ్యాదినారాయణునుద్దేశించియిట్లనిరి॥ ४०

దండకం॥

శ్రీమజ్జగద్రక్షణాక్షీణదీక్షాభృదీక్షాసమంచత్కటాక్షా స్వపక్షామరక్షేమకృత్కార్యదక్షా విపక్షోరురక్షోగణక్షోభకృద్విక్రమానీకజేంద్రప్రక్రియా యిందిరాసుందరీహృన్నళేందిందిరా మానిభాస్వన్మనోమందిరా బాహుపీరాంగనామందరక్ష్మీభవన్మందరాసుందరాకార గోవింద దామోదరా చారుమందస్మితోద్యన్మరందావృతాస్యారవిందా ముకుందా శతానందసంక్రందనాద్యర్చితాంఘ్రిద్వయా భక్తరాజీవరాజీవబంధూపయా మండితాఖండలోద్దండవేదండశుండాభదోర్దండదీప్యద్గదాశంఖచక్రాసి శార్ఙ్గప్రభావా హరి శౌరీ మురారీ హరీ మత్స్యకూర్మాద్యనంతావతారా శతారాబ్జతారా సుధారశ్మిమందార డిండీరహీరాదిరాజద్యశఃపూరకర్పూర కాండప్రపూర్ణత్రిలోకీకరండా మహాఖండవేదండభాండప్రకాండాధివాసత్ప్రచండా ప్రచండోష్ణరుఙ్మండలీమధ్యవర్తీ హృషీకేశ సర్వేశ దేవేశ చిత్కేశ విశ్వేశ శశ్వత్ప్రభా శాశ్వతామేయ విశ్వంభరా నీమహత్త్వంబచింత్యంబవద్యంబఖండంబభేద్యంబసంగంబబోధ్యంబబాధ్యంబువాఙ్మానసాగోచరంబవ్యయా భవ్యసేవ్యాగుణాతీత సర్వాత్మకా నీకచంబుల్మహామేఘముల్లోకనాథా సుధాభానుభానుల్ భవన్నేత్రముల్ శేషదృక్కర్ణతల్పా కకుబ్భాగముల్నీకుఁగర్ణంబులంభోజనాభా కృశానుండునీమోమునారాయణా శారదాదేవినీజిహ్వ సౌవర్ణకౌశేయ

ధారీభవత్ప్రాణమెన్నం జగత్ప్రాణమస్తోకవక్షస్స్ఫురత్కౌస్తుభా సాగరంబుల్భవద్గర్భ
గోళంబులం భోజపత్రేక్షణా యంతరిక్షంబు నీ నాభికాక్రోడమీశా త్వదీయోరుపాదం
బులీభూతలంబచ్యుతా నీశరీరంబు విశ్వంబు భూతాంతరాత్మా సముద్రంబునందూర్మి
కాబుద్బుదశ్రేణిచందంబునం దేవతిర్యఙ్నరాదిప్రపంచంబు నీయందు సర్గప్రవృద్ధ్యంతము
ల్గాంచుచుండు న్జగన్నాటకప్రక్రియాసూత్రధారీ శిఖావంతుఁడిధ్మంబులందున్నమాడ్కి న్స్వ
నో బుద్ధిదేహేంద్రియాద్యేకసంప్రష్ఠవైరాగ్యులం దల్లడన్జీవసంజ్ఞన్ప్రవర్తింతువీ వేకదా స
చ్చిదానందరూపా జితక్రోధమోహుల్సమస్తాగమార్థజ్ఞులధ్యాత్మనిత్యుల్వివిక్తస్థలాసీను
లాచారవంతుల్మనుల్నిన్నువీక్షింతు రాదిత్యచంద్రాగ్నితారాతటిత్పుంజులె న్కోట్లఁ దేజం
బు వాటింపగాఁజాల వెద్దాని ధీయుల్ప్రవేశించి పసూ యో భవప్రాప్తి లేకుండ రచ్చోటునీది
వ్య ధామంబు నీతత్త్వమెవ్వారికైనం నిరూపింపశక్యంబుగాకుండు మేమెమి వర్ణింపఁగా నే
ర్తుము ద్యద్దయాదృష్టి నీక్షించి రక్షింపు మో భక్తచింతామణీ దైవచూడామణీ వాసుదేవా
నమస్తే నమస్తే నమః॥ ౭౧॥

సీ॥ అని యిట్టులక్ష్మీసమన్వితుండగు నాదినారాయణుని జగన్మాన్యచరితు।
నమసుగస్థదికతో హర్షాశ్రుపూరితనేత్రులై పులకితగాత్రులగుచుఁ।
బ్రస్తుతింపుచు పునర్వందనంబులొనర్చ నతులగంధర్వదంపతుల భక్తి।
కారవశ్యమునకపారకృపాస్వాంతుఁడై హరిభవదీప్సితార్థమెద్ది॥
తే॥ గీ॥ యనిన వారలు రమఁబోలునట్టిపుత్రి।నంగభవుఁబోలు పుత్రుని మ్మనుచు వేఁడ।
నట్లయగునని వరమిచ్చియంబుజాక్షుఁ।డప్పుడంతర్హితుండయ్యె నతివతోడ॥ ౭౨॥

వ॥ అనంతరంబా పురజైత్రుండు నుందనయింతియు నత్యంత సంతోషితస్వాంతంబు
లతోమగుడ నిజపురంబుం బ్రవేశించి సుఖంబుండిరంత॥ ౭౩॥

కం॥ జానగుతమినయ్యిరువురు।నానావిధమదనతంత్రనవ్యసుఖశ్రీ।
తోనిరవొందుచు నుండం।గానవ్వేలుపు వెలందిగర్భముఁదాల్చెన్॥ ౭౪॥

కం॥ నెలపప్పి వింతచిన్నెల।నెలవగు నెలఁతుక కునిండు నెలవెన్నెలవ।
న్నెల గెలుచు దెలుపు చెక్కుల।నెలకొనన వి చంద్రశకలని యతిన్నరెన్॥ ౭౫॥

మ॥ నవగర్భోదయవేళ యక్తొలుకరిన్మందంబులై హంసయా।
నవిశేషంబులుడిందెనూర్పుగములన్వ్యాజంబునందూర్పు గా।
ద్పు వెస నీవ్చెఁబయోధరంబులొగి నుప్పొంగెన్వినీలంబులై।
నవకం బేర్పడెమించెఁజిట్టుములు సోనల్గాఁగురంగాక్షికిన్॥ ౭౬॥

కం॥ వళులవశేషితరేఖా। వళులయ్యె న్నెఱుఁగుటారు ప్రకటంబయ్యె।
న్దలమయ్యె నుదరమింతికి। నలసటయును నిదురయు రుచియధికములయ్యెన్॥ ౪౭॥

తే॥ గీ॥ మున్ను కటికోడినూత్న్మమై యున్న కలికి। కౌను చూలింతతనము రాఘనతఁ గాంచి।
దాని నెదురించెఁ జితుఁడైనహీనబలుఁడు। బలము సమకూడుత త్రివైరి గెలుచుఁ గాదె॥

చం॥ చల్లనితమ్మితూండ్లకిఁ బ్రియఁ జల్వవహించిన చేతులన్విభు।
న్నెల్లనఁ గౌఁగలించు మను మ్రింగినకమ్మని నోరమోవిన।
ల్లలన వానుఁ గాంక్షితరతాదులకున్ మదిఁ గొంకి ప్రార్థనా।
భ్యుల్లసదుక్తినైయెయుబుసువుచ్చుఁ బ్రియు న్జెలియప్డు గ్రీడలన్॥ ౪౯॥

చం॥ నెలలొగినిట్లుఁ దొమ్మిదియు నిండఁగ నెమ్మదిఁ బుణ్యభామిను।
ల్బలుముద మొందనొక్క శుభలగ్నమున న్దరలాక్షి గాంచెన।
క్కలువలఱేని నిందిరను గాంచినదుగ్ధపయోధిపీచికా।
తిలకము రీతి వేల్పులు నుతింపఁగ గుమారుఁ గుమారికామణిన్॥ ౫౦॥

మ॥ వెలుఁగొందెన్దివిఁ దారకాగ్రహముల వ్వేళ న్వరద్వేషనుం।
బలె సాంద్రంబుగ దేవదుందుభిరవవ్యాజైకగర్జాసము।
జ్జ్వలకల్పప్రసవప్రవర్షమొదవెన్ సౌరభ్యయుజ్మారుతం।
బులువీచెన్నటియించె నచ్చరలగుంపుల్స్వాంపుదీపింపఁగన్॥ ౫౧॥

తే॥ గీ॥ అపుడు పురజైత్రుఁ డమితహర్షాంబురాశిఁ। దేలిపుత్రోత్సవ మొనర్చి ద్విజతతులకు।
రత్నకాంచనభూషాంబరములనొసఁగె। మంగళాశీర్వచోవిభ్రమంబులలర॥ ౫౨॥

తే॥ గీ॥ అఖిలజగదీశుఁడైన పద్మాయతాక్షు। వరమహిమచే జనించుటవలన నక్కు।
మారునకు ధీరతనునలంకారచంద్రుఁ। డనుచుఁ బేరిడెనతఁ డతిహర్ష మెసఁగ॥ ౫౩॥

కం॥ కళలభ్యసించి చంద్రుని। కళభంగి మనోజ్ఞరూపకాంతిస్ఫురణ।
న్వెలయు నిదియనుచు జనకుఁడు। కళావతియటంచుఁ బేరు కన్నియకొసఁగెన్॥ ౫౪॥

మ॥ పొలుపొన్దన్నలకంబులార్చి జిలుఁగున్బొత్తిళ్లలోఁ జేర్చి త।
ళ్లులరాగిల్లుపసిండిగిన్నియలనుగ్గులొవ్వసికన్దోయిఁగ।
జ్జలమున్గస్తురిఫాలమందునిడుచు న్జన్నిచ్చియ మ్ముద్దుపి।
ల్లల మేల్పెంగ రుతొట్లలందునిచి జోలల్పాడి రాళీమణుల్॥ ౫౫॥

కం॥ ఇంతులిటులూడిగముల। శ్రాంతంబునొనర్ప రూపసంపన్నత చే।
నెంతయు బాలామణియం। తంతన్బాలేందురేఖయట్లుగ నెగడెన్॥ ౫౬॥

రంబునం దివినుండి దివిజగురుండ చటికరుదెంచిన నతని సముచితసత్కారంబుల నారాధిం
చి సుఖోపవిష్టుం గావించి పురందరుండు గురుచరణంబులకుం దన ముద్దుబిడ్డలం జేయివట్టి ప్రమో
క్కించి యిక్కన్నియ కేయే లక్షణంబులు గలవరుండు లభించు నీ యలంకారచంద్రుం డెట్టి ప్ర
భావంబు గలవాఁడగునని యడిగిన నా శుభప్రశ్నంబులకుం గొండొకతడవూహించి సముచిత
మనీషావాక్పతి యగు నవ్వాక్పతి గంధర్వపతి కిట్లనియె॥ ౬౪

మ॥ వనజాతాక్షువరప్రభావమున నివ్వామాక్షి జన్మించెఁగా।
వునభూమండలభర్తయై సిరులకున్ భ్రీవైగుణాంబోధియై।
దనుజార్యంశజుఁడై సువిక్రమయశోధారేయుఁడౌనొక్కచ।
క్కనిమర్త్యేంద్రుఁడు నీనికి న్విభుఁడగు న్గంధర్వరాజోత్తమా॥ ౬౫॥

వ॥ మఱియు లక్ష్మ్యంశసంభవయగు నిక్కళావతీసతీమతల్లికి సహజన్ముఁడగు నీ
యలంకారచంద్రుండు ప్రథమభవంబున దేవదానవు లమృతంబునకై క్షీరసాగరంబు మం
దరధరాధరంబుచే నమందగతి మథించుతఱి యందబ్జాలయయగు నిందిరాదేవికిం దోఁబుట్టు
వై యబ్జుండను నామంబున నుద్భవిల్లి రోహిణీపతియన విశ్రుతింబొంది నిశాధినాథుండై వ
ర్తిల్లె. ద్వితీయభవంబున నత్రియనుమహర్షికి ననసూయాదేవియందు హరిహరులయంశం
బులం బ్రభవించిన దూర్వాస దత్తాత్రేయులతోఁ బుట్టువై బ్రహ్మాంశంబునఁ జంద్రుండ
నుపేర జనియించి నావలన సకలశాస్త్రంబు లభ్యసించి యింద్రియలోలత్వంబున బాల్యవ
శంబునం జేసి నాకపకారంబుఁ గావించి తారాప్రియుండై యుడుపతియనం బ్రసిద్ధివహించె.
నీతృతీయజన్మంబున విశ్వరూపుఁడగు శ్రీమన్నారాయణు వరదానంబునం జేసి తత్సంకల్పవ
శంబున "చంద్రమాహృదయేజాత" యనువాక్యానుసారంబుగ నీకళావతీసతికి ననుజన్ముం
డై నీకుం జన్మించె నీగంధర్వలోకంబు సత్ప్రధాధిష్ఠితంబె గావున గగచరుండై కువలయాధినా
థుండనం బ్రఖ్యాతింబొందు మఱియును॥ ౬౬॥

సీ॥ కవిచకోరకదంబకంబులానందించు విమతాననాబ్జపాళి ముకుళించు।
లలిమిత్రకువలయంబులు వికాసము నొందు ఖలజనచక్రవాకములు గుందు।
బంధుబృందానందసింధువులు పొంగుఁ గనదధర్మధ్వాంతగతులడంగు।
సత్సంతతులకభీష్టార్థంబు లిరవొందుఁ గుమతిచోరప్రచారములుడిందు॥
గీ॥ నవనిఁ బొగడొందుఁ బరమసౌహార్ద్రహృదయుఁ।డమితదరహాసచంద్రికావిమలుఁ డాప్త।
భూరికరుణాసుధారసపూర్ణుఁడగుచు।సత్ప్రధాప్తి నలంకారచంద్రుఁ డలరు॥ ౬౭॥

చ॥ అనివాచస్పతిమున్నుభావిశుభవాక్యారూఢివాక్రుచ్చియా।
త్మనివాసంబునకేగనప్పలుకులత్యంతప్రమోదంబున।
న్వినియిక్కన్నియనాఁటఁగోలెసురలన్వీక్షింపదయ్యెక్షణం।
దనులంగోరదుమానసంబిడదుగంధర్వాదులందున్దమిన్॥ ౧౮॥

కం॥ జననాథాగ్రణియైన।జ్జనవినుతచరితుఁడైనచక్రినినరపా।
లునివరియించెదనని నె।మ్మనమునననయముఁదలంచుమానిని నెమ్మిన్॥ ౧౯॥

శా॥ ఆగంధర్వకుమారియీచెలివయస్యల్వీరలిచ్చోట హా।
ప్పైగన్పట్టెడురత్నసౌధములుశుద్ధాంతప్రదేశంబులీ।
శ్రీగంధామ్రమధూకకల్పసుమనోరింఛోళికాసంగిభృం।
గీగానోపవనీనికుంజచయముల్ క్రీడావిహారస్థలుల్॥ ౨౦॥

కం॥ అనుచుఁగలవాణికన్యా।జననాగతియుందదీయసద్వాంఛితము।
న్వినయమునఁదెలుపఁబురజి।త్తనయామణినధిపుఁడాత్మధనముగఁదలఁచెన్॥ ౨౧॥

చ॥ తలఁచినరేంద్రుఁడప్పుడుముదంబుననచ్చెలితోడవెండియుం।
బలుకుశుభవాదృశత్రిదశభామినులందిలకించిమాకు।
మీకలితవిపంచికామధురగానసుధారసధారవీనుల'
న్నెలకొనముచ్చటించుటలునేఁడుగదాగలిగెన్దలోదరీ। ౨౨।

తే॥ గీ॥ అనిననవ్విభుహృదయమావనజనయన।భావమునెఱింగికలవాణిపలికెనిట్లు।
లోకనాయకనీదగురాకవలన।నధిగతాభీష్టయయ్యెమాహంసయాన॥ ౨౩॥

కం॥ పురుషోత్తమనీసన్నిధి।పరిపూర్ణములుగమదీయభాగ్యములెల్ల।
న్వరుసఫలింపనొనర్చె।న్వరశోభమదీయపద్మపాణికిఁగూర్చెన్॥ ౨౪॥

కం॥ కావునమునుదేవగురుం।డేవెరవుననానతిచ్చెనిపుడదిసఫలం।
బైవెలయుశుభముతతిరా।దైవంబనుకూలుఁడగుచుఁదానెఘటించున్॥ ౨౫॥

చం॥ ధరణినృపాలకోటికవతంసమవీవునెలంతలందుభా।
స్వరగుణరూపశీలములవన్నియకెక్కిత్రిలోకసన్నుత।
స్ఫురితకళావిశేషములఁబోల్పగునీపురజిత్కుమారిమా।
యిరువురఁగూర్పఁడేని,విధినెంతురెవేల్పులువేల్పుపెద్దఁగన్॥ ౨౬॥

వ॥ అనిననతండుమునిసవనవిఘ్నకారులగుసురారులనిర్జింపుచుందదన్వేషణార్థం
బొంటిమైవచ్చితిఁగావున నేడిందుండి మదీయసచివాదిపరివారంబుగూడ నెల్లిమీపురంబున
కరుదెంచెదనని గంధర్వనాథప్రదర్శితంబగునొక్కమణిమందిరంబుననివసించి, యతనితో
సముచితసల్లాపంబులం బ్రొద్దుపుచ్చుచుండెనని నవిని జైమిని, పక్షులనవ్వలివృత్తాంతం బెఱిం
గింపుఁడనుటయు॥ ౧౬॥

శా॥ పారేమాయవిలాసభాసురపరబ్రహ్మైకరూపాకరా।
కారుణ్యాంబుధిభక్తసంతరణవిఖ్యాతాత్మసాక్షాత్క్రియా।
ధౌరంధర్యమహత్త్వసంకలితబోధప్రాప్తిచిత్సారయో।
గారూఢప్రదమోక్షభాగ్యకరనిత్యానందసంధాయకా॥ ౧౭॥

కం॥ సుబ్రహ్మత్వప్రవరణయబ్రాసిగభీరధీరయుమృతాకరసా।
రబ్రహ్మనాభ బాణము। నిబ్రహ్మసురేంద్రవినుతనిర్మలచరితా॥ ౧౮॥

కలకంఠము॥ పరమేశ్వరపదభాస్వరభరితాసురవినుతా।
కరుణారసవరణాసుఖకరణానుతచరణా।
పురభంజనగురురంజనభువనావనకలనా।
కరిదానవహరణాశివసునపన్నగధరణా॥ ౧౯॥

మాలినీ॥ విసమితబుధరక్షా విశ్వకృత్యాద్యదక్షా
గుణనిధిసకలేశా కోటిసూర్యప్రకాశా
ఘనకలుషవిరామా ఖండితాశేషకామా
యినశశిఘృణినేత్రా యీశగాంగీకళత్రా॥ ౨౦॥

గద్య.

ఇది శ్రీమదిమ్మానేన్యన్వయపయఃపారావారరాకాసుధాకరానవరతదేవబ్రాహ్మ
ణపూజావిధేయదిగంతరాక్రాంతయశఃపరిపూరితశ్రీబాపనార్యపౌత్రవీరే
శలింగనాయకపుత్ర శ్రీమద్గౌరీరమణచరణారవిందామందమకరంద
పానతుందిలేందిందిరాయమాణ శ్రీదక్షిణామూర్తిరామజోగి
గురుప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషాచతు
రకవితావితానానూనవైభవబుధజనవిరాజ
మానశరభలింగాభిధానప్రణీతంబైన
యలంకారచంద్రోదయంబను
మహాప్రబంధంబునందు
తృతీయాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

శ్రీ మఖధ్వజ చరిత్రంబను నామాంతరముగల

# అలంకారచంద్రోదయము.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీగౌరీకుచకుంకుమ। రాగోద్భాసితసువక్షరమణీయమహా।
భోగీంద్రభూషసంహృత। యాగామృగయాపురీశ యఘచయనాశా॥ ౧॥

తే॥ గీ॥ అవధరింపుము మునుమృకండాత్మజుండు। క్రోష్టికెఱిఁగించినట్లు సద్గోష్ఠినమర।
జైమినికి నెమ్మనము కడుసంతసిల్లఁ। బక్షిరత్నంబులిట్లు చెప్పందొడంగె॥ ౨॥

క॥ ఆవిధమున మణిగృహమున। నావిభుతో గోష్ఠిసల్పి యచటఁ దదనుసే।
నావిధిభృత్యుల నునిచి ని। జావాసంబునకుఁ బురజిదాహ్వయుఁడరిగెన్॥ ౩॥

ఉ॥ పిమ్మట నమ్మహీవిభుఁడు పెల్లనురాగముతోడ వేలుపుం।
గొమ్మను నెమ్మదిం దలఁచి కొంచుఁ గనుంగొనలందు నశ్రువు।
ల్గ్రమ్మఁగ నమ్మణీభవనరంగమునన్గలయంగ వేమఱుం
గ్రిమ్మరు నమ్మరుండు వళుకున్జిలుకుల్బలుకిన్కనేయఁగన్॥ ౪॥

సీ॥ లలితపంజరశుకాలాపములెవ్వనైన నతివపల్కులటంచు నాలకించుఁ।
గాంచనపాంచాలికాశోభగనైన బాలికాకృతియంచు భ్రమవహించుఁ।
బటువజ్రముకురబింబములఛాయలఁ జూచి ముదితాస్యరుచులంచు మదిఁదలంచుఁ।
గురువిందకుట్టిమసరణులారసి యోషిదంఘ్రిలాక్షాంకంబులంచు నెంచుఁ॥

తే॥ గీ॥ చిత్రభిత్తికఁ దద్రూపచిత్రలీలఁ। గాంచి క్రొమ్మించుబోఁడి నీక్షించితినిపు।
డంచు డాయఁగ గమకించుఁ బంచబాణ। బాణధుతధైర్యుఁడగుచు భూపాలసుతుఁడు॥ ౫॥

చం॥ అసదృశకల్పపాదపఫలాతిరసాద్యము తెల్లజాళువా।
వెసలలనుంచియూడిగపు వేల్పువెలందులు దెచ్చియిచ్చిన।
స్మైసవఁడు వేఁడికొన్న బలిమిన్జవిఁజూచును గాని చూడఁడిం।
పెసఁగఁగ ముచ్చటాడఁడు మహీపతి తద్విరహార్తచిత్తుఁడై॥ ౬॥

తే॥ గీ॥ అనిశము తదీయనిశ్చలధ్యానయుక్తి।నలరునృపునకు బహురూపములఁ బ్రసన్న।
యయ్యె మోహనలక్ష్మినానప్పుడెల్ల।కడలలో వెలిఁగను పట్టు కలికిరూపు॥ ౭॥

వ॥ ఇట్లు మిత వేదనాచలితహృదయుండై నృపతనయుండు నిజాంతర్గతంబున॥ ౮॥

సీ॥ తొలిజన్మములను నెచ్చెలులే మినోములు నోచిరో చెలి చెల్మి మోచియుండ।
రతనాలవీణెయెట్టితపంబు సల్పెనో బాలిక చేపట్టుఁ బాయకుండ।
సుమణిహారంబులే సుకృతంబొనర్చెనో కాంతాకుచాగ్రభాగముల మెలఁగ।
సదనదర్పణములే సద్విధుల్ చేసెనో ప్రమదాను బింబభాగ్యములు గలుగ॥

తే॥ గీ॥ నిచటిమణిచిత్రసౌధంబులిచటితమ్మి।కొలఁకులిచ్చటియుపవనీకుంజతటులు।
నెట్టియుపకృతిఁ గావించియెసఁగనొక్కొ।రమణికేళీవిహారసంప్రాప్తినొనర॥ ౯॥

చం॥ అలచెలియూరురంభలభుజాచ్ఛబిసంబుల హాసచంద్రికన్।
బలితపు గబ్బిగుబ్బవిరిబంతులఁ జెక్కిలికప్పురంపు బి।
ళ్లలజిగిమోవిపానకములందనివొందినఁ గాక యేక్రియ।
న్దలమగుచున్నయివ్విరహతాపభరంబు శమించు నాకిఁకన్॥ ౧౦॥

చం॥ చెలిదలపువ్వు చంద్రునిగఁ జెందిరపుందిలకంబు ఫాలమం।
దలి సెగకన్నుఁగా నెదఁగనంబడు హారములన్భుజంగభూ।
షలుగ జటన్గపర్దముగ సారెదలంచి గిరీశభీతిచేఁ।
గలఁచుట మానినన్మకనిఁద్రాఁచుట యోవలరాయ? న్యాయమా॥ ౧౧॥

ఉ॥ ఎన్నఁడుకన్నులారఁదర లేక్షణఁగ్రమ్మరఁ గాంతుఁ గాంచియ।
య్యన్నులమిన్న తోడ నెనరానఁగ ముచ్చటలాడి మోవి మేల్।
జున్నులుగ్రోలి మక్కువలఁ జొక్కుచుఁ గౌఁగిఁట గారవించుచు।
న్గ్రొన్ననవింటివానిబలుకూటమి నెన్నఁడు గూడఁగల్గునో॥ ౧౨॥

కం॥ అనియిట్లు మోహవివశత।మనుజాధిపనందనుండు మణిమయసదనం।
బుననుండెనిటఁగళావతి।యునుదదధీననిజమానసోత్కటవృత్తిన్॥ ౧౩॥

తే॥ గీ॥ ప్రాణసఖులవింతపడఁతులుగాఁజూచు। పలుకరింపదెలమిచిలుకనైనఁ।
జెదరుకురులఁజక్కఁజేయదుమైమర। పూనినిలుచుఁజింతనుస్సురనుచు॥ ౧౪॥

మ॥ మృదుమధురోపహారములాఁకించుకవాచవిఁగైనమోవిఁజే।
ర్పదువరపారిజాతసుమవల్లరులంటదుకేలనైనఁజూ।
డదుకడకంటనైననెదుటందగుపంకజపాళిమైనలం।
దదుఘనసారసాంకవకదంబమునంబుజనేత్రచింతచేన్॥ ౧౫॥

సీ॥ హృదయస్థితానంగుఁడెదనేయములుగలమొనలుపైఁదోఁచెనామొలచెఁబులక
లానంగశిఖికిఁదోడైవచ్చుకమ్మవీవఁడులనఁబలపుటూర్పులుజనించెఁ।
దద్వాతనిహతిచేతవియోగజలధియుప్పొంగెనాఘుర్మాంబుపూరమొదవె।
నానీటివెల్లిపైనలముడిండీరకాంతులునాఁగనెమ్మేనఁదెలుపువొడమె॥
తే॥ గీ॥ తెలుపునకుఁదోడునీడలైవెలయుహార। కలితమౌక్తికములుపెనుగాకఁగ్రాఁగి।
బాష్పధారలఁగరఁగిపైపైనఁగ్రమ్మ। కొమ్మపాలిండ్లమవెండికొండలట్లు॥ ౧౬॥

క॥ అనిశధ్యాతనృపతినం। దనవదనేందురుచిమరుత్ప్రతాపప్రభచే।
తనునర్ధముకులితములై। కనుదమ్ములుతనరెనమరకామినికంతన్॥ ౧౭॥

ఉ॥ వారకస్రుక్కుబాహుబిసవల్లులునాడెఁగుచాబ్జకోశము।
ల్హారపుఁగంకణావళులుతోడనెజాఱసమంచితోర్మిక।
ల్సారెగలంగెజీవనముశ్వాసమహోష్ణసమీరవారవి।
స్ఫారగతిన్వియోగవసువర్తిదినంబునఁజారువేణికిన్॥ ౧౮॥

క॥ సాగసగుచనుబంతులపై। జిగిదగుమగరాలసరులుచెలిసాంజననే।
త్రగళజ్జలములజూయ్యాని। పొగలెగయఁగనింద్రనీలములసరులయ్యెన్॥ ౧౯॥

ఉ॥ నూతనమండలీకృతధనుర్లతికాపరివేషధారియం॥
ఖ్యాతహృదబ్జయంకరశరాళికరప్రకరుండుచిత్తసం।
జాతవిభాకరుండువెలుచంబలుచందములంగలంపఁగం।
జాతముఖీకుముద్వతివెసన్వివశత్వమునొందెస్రుక్కుమన్॥ ౨౦॥

తే॥ గీ॥ చెలివిరులపానుపునమేనుఁజేర్పనవియు। స్మరునిశరములకాననేచందొడఁగెఁ।
గడునలసిచెల్మికత్తెలఁగన్గొనంగి। ఘోరవిరహార్తినరిగెశృంగారవనికి॥ ౨౧॥

క॥ కలికిమలయంపువలిగరు। వలికిన్జలదళులబలురవలికిమయూరం।
వళికీరశారికామం। డలికిన్డినులికితద్వనంబునమెలఁగున్ ౨౨॥

సీ॥ తలిరుటాకులజొంపములు దావశిఖలంచు నెంచియందులఁ బ్రవేశించఁజూచు।
నునుఁదీవలురగంబులని డాసితత్పల్లవాగ్రజిహ్వలు కేలనంటఁదివురు।
వెడలుపూఁదేనియవిషధారలనుచు వితర్కించి సారెకుఁ ద్రావఁదలఁచు।
శశికాంతకృతమహీజాతాలవాలంబులో నరడిగ్గియలంచు నురుకఁదొడరుఁ॥
తే॥ గీ॥ గదిసి మదనుండు వదలక యదనెఱింగి। పదులునూరులుగుదులుగ నెడనదిమెడు।
నురుశరమ్ములవిసరులకోర్వలేక। తనువుఁదొలఁగంగఁదలఁచియవ్వనజగంధి॥ ౨౩॥

ఉ॥ నెచ్చెలులత్తఱిన్వరమణీభవనాంతరపుష్పశయ్యపై।
నచ్చపలాక్షిఁగానకరయంబున మారుని బాఱికోర్వలే।
కిచ్చటనుండిగోలయిపుడెచ్చటికేగెనొయంచుఁదద్వనిన్।
జొచ్చినికుంజపుంజములచోటులనారసియందునొక్కచోన్॥ ౨౪॥

కం॥ కలువలచెలివెలుఁగులచే। నలువుఁదొలిగినిదురఁజెందునలినియుఁబోలెన్।
న్దలమగువలరాయనికా। కలనలయుచు సొలయులలనఁగనుఁగొనిరెలమిన్॥ ౨౫॥

కం॥ దరియంజనినునుఁజెక్కులఁ। దొరఁగెడుకన్నీరువోవఁదుడుచుచు నంసా।
పరిపిదిలిజాఱుఘనకచ। భరమును సవరించియిట్లు పలికిరి చెలిమిన్॥ ౨౬॥

ఉ॥ అరనిముసంబు మమ్ము నకటా యెడఁబాయనిదానవౌంటినే।
తెరఁగున వచ్చితమ్మ దరిఁ దేలని భూరిమరందసింధులే।
తెరఁగున నీదిశమ్మవనిఁ దెప్పరమాకపురంపుతిప్పలే।
తెరఁగున దాఁటితమ్మ సుదతీ తెగువల్లగునమ్మ యిమ్మెయిన్॥ ౨౭॥

చం॥ ఇలనెలఁబ్రాయపుంజెలువలిచ్చవహింపరటమ్మ దివ్యమా।
చెలువముగల్గు చెల్వలకు చిత్తమునందిటు తాల్మిఁదక్కచిం।
తిలుదురటమ్మ మేను వెనుతియ్యని తియ్యనివింటిమేటికా।
కలనలయింతురమ్మ కొఱగాములు సెల్లునటమ్మ యింతికిన్॥ ౨౮॥

ఉ॥ నెమ్మదితాపమేల తరుణీధరణీరమణుండు నిన్నుశీ।
ఘ్రమ్మున గారవింపను రాగమునన్విభవంబులందెదో।
యమ్మరొనమ్ము మద్వచనమాత్మఁధనమ్ముగ లెమ్మురమ్ముతో।
రమ్మగునివ్వనమ్మునదిరమ్మగుసంపదఁజూతమిమ్ములన్॥ ౨౯॥

కం॥ అనిబాలం గనికేలం। గొని లీలం దిగిచి యెత్తి కూరిమితోఁ దో।
డ్కొని కేళీవనపాళికిఁ। జనె నాళీజనము మనము సంతసమందన్॥ ౩౦॥

సీ॥ అధరబింబముల కైయరుదెంచు చిలుకలు తనుసంకుమదగంధమునకుఁ బఱవ।
ముఖపంకజముల పైముసరు తేఁటులచాలు విమలనాసాచంపకములఁ దొలఁగ।
నక్షిమీనముల డాయఁగ వచ్చు కోకముల్ నగవువెన్నెలలచే నెగసిపోవ।
భుజమృణాళికలఁ గప్పు మరాళికలు నీలకబరికాభ్రములచేఁ గలఁగిపోవఁ॥
తే॥ గీ॥ జనుచెలుల మూపులఁ గరంబులునిచి పొదల। విరుల నిట్టూర్పుగాడ్పుల వేఁడి నులియ।
చివురుటాకులు నెమ్మేనుఁ దవిలి వాడ। విరహతాపాప్తి వనవీథి వెడలె రమణి॥ ౩౧॥

కం॥ ఓజవనీభూజసుమస। మాజవిభవ మెఱుకపరచె మానినికపుడా।
ళీజనమే తత్కథన। వ్యాజంబునఁ బ్రొద్దుపుత్తమనుచున్ బ్రేమన్॥ ౩౨॥

చం॥ వరసుమనోనురాగవిభవంబున గుచ్ఛకుచంబులానిసం।
భరితరుచిం జెలంగు మృదుపల్లవపాణులఁ బూగనాథుకం।
ధరనుగవుంగలించుచు లతావనితామణి భృంగనాదసా।
దరమృదువాగ్విలాససముదారత మంతనమాడెఁ జూచితే॥ ౩౩॥

చం॥ మునుపువుఁ దేనెనల్కి తెలిమొగ్గలముత్తెపుముగ్గు వెట్టియుం।
పొనరుపరివారదీపికలు నొప్పగు పూఁబరపుల్ ఘటించినుం।
జనిలయసీమలిట్లువరుసన్గయి సేసి మరుప్పరాప్తికై।
కనదళివీక్షలై యెదురుగన్గొనెఁ గంటె లతాసతీతతుల్॥ ౩౪॥

చం॥ అనిశమహానురాగసముదంచితలాసరసాంతరంగ ప।
ద్మినులమదాంధతిన్వెడచిద్రిమ్మగుతుమ్మెద నెమ్మికాఁదుగా।
ననయముఁ జూచి తేయవినయమ్మునఁ బుష్పిణులైనకొమ్మలన్।
దనరఁగనొందుచుండె వనితామధుపాళులకేదనిల్కడల్॥ ౩౫॥

సీ॥ వితతాళిమాలికావేణువుప్రమోయించబలు నెమ్మినటనముల్ వ్వేలయఁ జేసి।
కలకంఠకాకలీగానంబులలరించి సూనమండలవిలాసగతులుపూని।
కమనీయశుకభాషణములనుచ్చటలాడి వలపూరవిమలనవ్వులొలపవించి।
మంజుకింజల్కరోమాంచగుచ్ఛస్తనాంచన్మహీళాసహస్రముల నెనసి॥
తే॥ గీ॥ క్రమశాఖాభుజంబులఁ గౌఁగలించి। కలరవస్వనమణితంబులొలయఁ గూస।
కేళిఁ జూపించెఁ గాపింఛకృష్ణమూర్తి। యిన్వనంబునఁ గనఁగొంటె యిందువదన॥ ౩౬॥

కం॥ వనిసాధుమాధుకరగోష్ఠినివర్తిలుచున్నతపసిచిత్రంబుగనా।
తనశోభనలరుగణికల। నెనసి మొగడఁజన్నులం టెనిదిఁగనుఁగొంటే॥ ౩౭॥

మ॥ నలుపైకారుమొయిళ్లభంగిదివినంటన్ బాఱికిసాంద్రచ్ఛదో।
జ్వలతంబొల్చుతమాలసాలములలోసంపుష్పితాశోకశా।
ఖలుమందానిలకందళాహతులచేఁగంపింపుచుండీవనిం।
చులుఁబోలెం నెఱిమించెఁగాంచితెవనినోణపఱివాళాధరా॥ ౩౮॥

సీ॥ ఆమ్రవల్లరి కేలనంటుమల్లనెబాలతిలకింపుమీదీనిఁదిలకమేని।
సుపతితాచఁగదమ్మయిడియశోకపుఁగొమ్మకౌఁగిలింపుముతావిఁగనయుఁగ్రోలి।
యిదిప్రియాళువునాలిగదిసిపాదముగీతిముచ్చొగాము చ నేగుముదితగోఁగు।
కాంచనంబిదియింగినించి తేముఖకాంతిచేరినవ్వుము పొన్నచెలియమిన్న॥
తే॥ గీ॥ శ్వాసమొందింపుమిదిసింధువారమనెవ।యువిపకేసరమిదిగీనినుమియుమమ్మ।
యిటులొనర్చినఁగాకయివ్విటపములుసు।మంబులీనవువింటివేమంజువాణి॥ ౩౯॥

కం॥ అనిజవ్వనికవ్వనితలు।వనితవిభవము దెలిపివరసురభిరజం।
బునఁబసిమిఁదాల్చితనులత।లొనరఁగఁబుష్పాపచయసముత్సుకలగుచున్॥ ౪౦॥

ఇభగతిరగడ। పొలఁతి? యీగొజ్జంగిపొవలతేనియసోన।
కళులు పటుచాతకములై మసలె వనిలోనఁ।
జిన్నినునుఁజివురాకుఁ జిదిమితివె కెంగేల।
కన్ను లెఱ్ఱగఁ జేసెఁ గదవె కోకిల బాల?।
గానకనకములుఁ గొనుచుఁ గదలె దిమ్మరముఱిచ్చు।
వనలక్ష్మిసొమ్ము లని వపలఁ జేమనవచ్చుఁ।
గొమ్మ?కయి నంటి ననఁ గోయు మిఁక నంపకుము।
నెమ్మొగము చాయలననిది నదీచంపకము।
కనవనిలగతినెగయు కపఱిపు దుమారములుఁ।
గని వెన్నెలని పలిచెఁగదె కోకవారములు।
బింబ మని యెదుఱుకొనె విడచి శుక మెలమావి।
నంబురుహనయన? దవ్వ రసి నీకెమ్మోవి।
జడిగొనఁదొరంగెఁ గేసరముల మరందములు।
తడిసెఁదద్బిందువుల ధమ్మిల్లకుందములు।

పటు మధుప వితతులభ్రములని మయూరములు।
నటియించెఁ గంటె తన్నటనపుటొయారములు।
క్రూరఫణులనుఁ జుట్టుకొనియె నీచందనము।
చేరఁబోకచటి కోచెలినీకు వందనము।
కేదంగిఁ గోయ కేగద వేటికి మిటారి।
కాదటే?మరునకది కడుబంగరుకటారి।
కలికి వనదేవతల కర్ణికాకారములు।
తెలిపెనిచ్చటఁజూచితేకర్ణికారములు।
వేడుకగ వినవేల పికకుహూకారములు।
చేడె యవి విరహిణుల చెవులకుఁ గఠోరములు।
లతలచాటునఁ బెంపలరు నీదు కొనగోరు।
నతివ యల్లయదిపూవని కేలఁ గొనఁగోరు।
నరవిరియు మొల్లవిరులల్లచట మొల్లములు।
మరచిపోఁదగునటే మరునకవిభల్లములు।
మరువంపు సౌరభము మఱలించెఁ గురువేరు।
సరిగాదు దానికిఁక జగతి వేఱొక వేరు।
సుదతిరో చేకొనవె సురపొన్న క్రొన్ననలు।
చదలంటెఁ బుష్పాదులు సారె తద్వాసనలు।
కొలఁదిగననివిరాలిఁ గొని సొలసినదికొమ్మ।
జలజాస్త్రఁ గొల్తమిక సఖులార రారమ్మ॥ ౪౧॥

తే॥ గీ॥ అనుచువనకేళిసల్పిపద్మాయతాక్షు।లతులవివిధలతాంతసంతతులలోన।
నమితసౌరభరుచిరములైనవాని।నెంచిమదనునకర్పింతమంచు వెడలి॥ ౪౨॥

క॥ చిత్రంబుగనిటుమరునివి।చిత్రాకృతివ్రాసిపూజఁజేయుచుభక్తిన్।
స్తోత్రములొనర్చిపంకజ।పత్రాక్షులుకేళిసౌధభాగముఁజేరన్॥ ౪౩॥

క॥ చరమమహీధరశిఖరాం।తరసరణిన్దరణిజరుగఁదద్గైరికసాం।
ద్రదరజశ్ఛన్నతఁగనెనన।స్ఫురితజపాశోణకిరణశోభితుఁడయ్యెన్॥ ౪౪॥

మ॥ తరుసంఘంబులకెల్లఁబల్లవితచూతత్వంబుఁగల్పించిభూ।
ధరశృంగంబులకెల్లమేరుశిఖరత్వంబుంబ్రసాదించిభా।
స్వరసౌధాగ్రగతేందుకాంతములకున్సౌగంధికచ్ఛాయలన్।
విరచించెన్జరఠారుణాతపములవ్వేళంగనుప్పట్టులన్॥ ౪౫॥

కం॥ ఖరకరుఁడరిగెనురమ్మని।స్ఫురదుదయాచలమువెనుకఁజొచ్చినయిరులన్।
ద్వారఁబిలువఁజనుఁదదాప్తుల।కరణినరిగెనీడలుతొలిగడకునిడుపులై॥ ౪౬॥

కం॥ చారులుదేరుచుఁగూడులఁ।జేరెఁబతంగములుభానుశిలలకుఁదాపం।
బారెన్మృగతృష్ణావా।ర్ధారంజడిఁదీరెమింటరక్తిమమీరెన్॥ ౪౭॥

మ॥ వరసన్మార్గగతుండినుండుత్రిజగద్వంద్యుండనన్బొల్చెదు।
స్తరమాదైవనియుక్తిఁబంకజరజస్సంపర్కయైసాంద్రదశీ!
ఘురసంబానినపద్మినింగలసితద్దోషంబువాయన్మహా।
పరపాథోనిధిలోనఁదామునిఁగెనాభానుండుఁగ్రుంకెన్వెసన్॥ ౪౮॥

సీ॥ చరమదిక్చండికార్చాకాలశాక్తేయరచితకుంకుమరజోరాశియనఁగ।
సింధునాథసగంధసింధురోపరిపరిష్కృతరక్తరాంకవశ్రీయనంగ।
పశ్చిమాంభోనిధిప్రాంతసైకతసముద్భూతవిద్రుమలతాజాతమనఁగ।
స్ఫుటనటత్పటుమహానటశిరస్తటఫణీశ్వరఫణామణిగణచ్ఛాయయనఁగ॥
తే॥ గీ॥ విరహిజనహృద్భయంకరవిషమబాణ।జైత్రయాత్రాసమారంభసంభవాబ్జ।
జాండపూర్ణతదీయశౌర్యాగ్నికీల।సముదయంబనసంజకెంజాయమెఱసె॥ ౪౯॥

కం॥ అనుఁగుజవరాలికౌఁగిట।నెనయకసుఖముడిగిచింతనేగెరవిసనం।
గనియొకజక్కవ యకటా।యినహీనతనున్నచక్రమెట్లుసుఖించున్॥ ౫౦॥

చం॥ ఇనుఁడపరాశఁజెందెనిఁకనేటికజీవనమంచుఁబద్మినీ।
వనితవిషాదవేదనలఁబొల్పడితుమ్మెదచాలుపేరిట।
న్జనువిషధారగ్రోలననిశంబమృతస్థితిఁగల్గుటన్ మృతిం।
బొనరకమూర్ఛఁగన్గొనఁగమోడ్చెననన్ముకుళించెఁబద్మముల్॥ ౫౧॥

చ॥ తనపతివచ్చునంచుఁబ్రమదంబునరేజవరాలునెమ్మొగం।
బునమృగనాభికాతిలకమున్ఘటియించెననన్దమంబునో।
య్యనబలుకొమ్ముడిన్ముడిచినట్టివినూతనఫుల్లమల్లికా।
ఘనకుసుమప్రగోఘమనఁగానఁగనయ్యెనుడుప్రతానముల్॥ ౫౨॥

సీ॥ వైకుంఠశితికంఠవరకంఠకలకంఠ కాలకంఠాభల మేలమాడి।
తతశైలతనయాలఘుతమాలహరినీలకాకోలరుచులఁ జీకాకుపఱచి।
యళిపుంజమృగభంజనలవాంజనశుభాంజనాగ్రకుంజరలీలలవఘళించి।
యమునాంబరబలాంబరమహాంబుదకదంబకాదంబకాంతులఁగలయమెలసి॥
తే॥ గీ॥ వేల్పుదొరమేనిచాయతో వియ్యమంది। కదిసె సదసాభిసారికాకాముకప్ర।
కామదమృగీమదాలేపకల్పమగుచుఁ। గటికచీఁకటి బ్రహ్మాండగహ్వరమున॥ ౫౩॥
తే॥ గీ॥ ఘనతిమిరసంగమున సంధ్యఁ గాంచి లోక।ములకుఁ బెంచుకొనఁగ నిద్దలలితతర్ష।
ధృతజనకరూపనైజసంతతులనంగఁ। గజ్జలయుతాగ్రగృహదీపకళికలమరె॥ ౫౪॥
కం॥ ఘనకువలయపాలనకుం। జనుదెంచెడి రాజు విడియఁ జతురతఁ బ్రాగ్ది।
క్కున ఖేచరులెత్తిన ధా।తనవపటకుటీరమనఁగ ధవళిమపోఁచెన్॥ ౫౫॥
చం॥ సమయవిటుండు గన్మొఱఁగి శక్రదిశావిటి గబ్బిచంట సాం।
ద్రముగ విదిర్చు చెందిరమనందగెఁ బాటలరేఖ యవ్విభు।
న్నెమకికనంగ నవ్వెలఁది నెమ్మొగమెత్తెననన్ సుధాంశుబిం।
బము వెసఁదోఁచెఁ గాంచిగరిమన్నగనావిలసిల్లె వెన్నెలల్॥ ౫౬॥
తే॥ గీ॥ సోముఁడుదయాద్రికైలాససీమ వెడలి। లోకభీకరమేచకరాస్తోకతిమిర।
హాలహలమానెఁగాని నాడంకదంభ।కలితతత్కంఠకాళిమ గానఁబడునె॥ ౫౭॥
సీ॥ వనములెల్లను గల్పవనములుగావించి రాలనెల్లను మగరాలఁ జేసి।
కొండలెల్లను వెండికొండలుగావించి నదులనెల్లను నభోనదులఁ జేసి।
జలధులెల్లను దుగ్ధజలధులుగావించి కరులనెల్లను వియత్కరులఁ జేసి।
సరసులెల్లను సుధాసరసులుగావించి నరులనెల్లరను గిన్నరులఁ జేసి॥
తే॥ గీ॥ దైవసృష్టికిఁ బ్రతిసృష్టిఁ దారచించి। బ్రహ్మమును బోలె జగదంతరంబు నిండెఁ।
గుండలిపచంద్రడిండీరఖండకాండ।సమవిమలధామకౌముదీసముదయంబు॥ ౫౮॥
కం॥ కుముదంబులకు ముదంబులు। కొమరారెఁ జకోరికలకుఁ గోరికలాదవెన్।
రమణులకును రమణులకును।దమి వెలసెన్ దమియు వెలసెఁ దనపతిశోభన్॥ ౫౯॥
కం॥ పగఁటివిరహంపు వేఁడిమి। నొగిలినకుముదినులు చలువనూల్కొనసాంద్రం।
బుగఁ బన్నీరుకరంబులఁ। దొగ చెలిచిలికెననరాలెఁ దుహినకణంబుల్॥ ౬౦॥

వ॥ మఱియు సుతోదయోల్లాసంబున వియదుల్లీఢకల్లోలంబై యుల్లసిల్లి పాలవెల్లి వెల్లివాఁడిచి పుడమి నెల్లెడల నల్లుకొనియెనన నంతకంతకు ననంతంబుగా దిగంతంబులనా

క్రమించుచు నంబరతరంగిణీఝురంబులనుండి భూమండలంబునకు డిగ్గు మరాళమాలికల పోలిక నస్తోకవ్యాకోచకైరవవిసరంబులగు సరోవరంబులఁబ్రసరించుచు విధుంతుదవద నగహ్వరప్రవేశాభ్యాసవశంబునం బోలె సాంద్రేంద్రనీలజాలగోళంబులం దూఱుచుఁ దిమిరజలదసమయ విగమంబగుటయుఁ బెల్లు రెల్లువిరిసెనన విశాలంబులగు కూలంకషాకూలంబులం గ్రాఁగుచుఁ గుసుమసముదయంబుచందంబునఁ దరులతాఛదంబుల ధాళధళ్యంబున మెఱయుచు మదకేసరికిశోరవారంబు తీఱున శిఖరిశిఖరంబు లెక్కుచు లీలం దేలియాడు వాలుగుమీలబెళుకుల చెన్నున మున్నీటిపెన్నీటికరడులమీఁద దీపించుచుఁ గౌముదిదానగుట నభివ్యక్తశుద్ధవర్ణంబై ద్విజముఖంబుల వ్యాపించుచుఁ జంచద్విధుమండలహరిణముఖపరిచ్యుతరోమంథబంధురఫేనపుంజంబులవడువున సంకేతకుంజంబుల పైరంజిల్లు ఫుల్లమల్లికామంజరుల మేదురామోదంబున మోదంబు రెట్టింపఁ దోలుతఁ గలసి యలసిన కాముకులబదరియుపరిసురతంబు నెఱపు తరుణులసుఖస్ఖలత్కుళల తెరంగున నగ్గరంగి తోరంగు చెంగలువరాచట్టుల జలజలని తెలినీటితళుకుల నేకీభవించుచుఁ బెంపు గాఁగురియు నమృతధారాపరంపరలకు ముంపులై యింపొలయు వియత్తలంబున కెత్తిన కుత్తుకలు వంపక బెంపార బెంపిల్లు గూయుచుఁ గుత్తుకబంటిఁ గ్రోలి వెక్కసంబుగఁ బుక్కిళ్లం బట్టి యొండొంటికందిచ్చుచు హెచ్చినమచ్చికలం గలయు నచ్చకోరదంపతుల సొంపునఁ బటికంపుగిన్నెలఁ జెన్నలరు నారికేళాసవంబు లాసకొలందిఁ గమిచి తదీయమదోన్మాదంబున వినోదంబుగా బాడు విచిత్రగీతంబుల వ్యత్యస్తసల్లాపంబుల వింతవింతనటనంబుల వికృతచేష్టావిలాసంబుల నకారణహాసంబుల మెలంగి తెలివిఁగని వలపుఁగొని మణిమంజీరసింజితంబులు లియ నలగుఁబోదలకుంజని వనీపవనంబునం బయ్యెదలుఁ దొలఁగింపక యొత్తొలంగ బంగారుబొంగరాలహారంగునఁ బొంగారు మొలకచనుంగవల మిలమిలలం గనుపట్టు శిబ్బెంబులు గుబ్బటిల్ల గొబ్బునం గవుంగిలించు ప్రాణవల్లభులతో మల్లడిగొని వివిధబంధచమత్కారంబులం గూడి క్రీడించు మించుఁబోడుల చంచలదృగంచలప్రభల రాణించు వజ్రతాటంకలాలాటికాచాకచక్యంబులతో సఖ్యంబొనర్చుచు నిట్లఖండపాండురచ్ఛాయామండలంబుల మెండుకొని పండువెన్నెలలు గాయఁగా యజుండే యెడం జూచినఁ దానయై యమేయవిక్రమంబునం బాయక చాయాలుదేఱు సాయకనికాయంబు లేయ దాయయై మలయానిలుండు డాయ నుల్లంబు ఝుల్లనం దాలిమిఁ దూలి నిదుర నొందక కెందలిరుపాన్పు డిగ్గి పవమానవిలోలబాలవల్లరియుం బోలె సోలుచు నక్కళావతీసతీతిలకంబు నిరంతర నిజస్వాంతచింతిత మహీకాంత కాంతాకారంబు కన్నులఁ గట్టినట్లై కంటఁ గట్టినని దిగ్గన లేచి బయ

లుఁగవుంగలించుచుఁగలవళించుచు నక్కటా దైవంబునిర్దయుండయ్యె నేమిసేయుదు
నని బుడిబుడి కన్నుంగవ నీరుజడిఁగొన నడుగులుతడఁబడ నడుముగడగడవడఁక వెన్నెల
యేటనురికెదనని చంగునందుముకఁ జారకుఁజారుక్కున చొక్కపుమేన నక్కజంబుగ
వెన్నెలలుగ్రక్కునసోఁక మిక్కిలివెక్కసంబునమూర్ఛిల్లిన నొయ్యన నొయ్యారంబుగ
నెయ్యంపుతొయ్యలులు చయ్యనయ్యింతి నెత్తికొనివచ్చి శిశిరజల బిసకిసలయ శశిశక
లాదుల శీతలోపచారంబుఁగావింప నెట్టకేలకు సేదఁదేరి తేటిచూచి చంద్రునుద్దేశించి
యుపాలంభంబుగా నిట్లనియె॥ ౬౧॥

మ॥ సుమనఃప్రీతియొనర్చి సత్పథచరిష్ణుత్వంబు సర్వజ్ఞమౌ।
ళిమణిత్వంబును గాంచు రాజవయి హాళిం శంబరారాతిస।
ఖ్యమునన్మీఱుచు భీరుతాకలితపాంథాళిన్ దయాశూన్యతన్।
శ్రమమొందించి కలంచుటెంచ నృపధర్మంబే నిశానాయకా॥ ౬౨॥

చం॥ హితసరణిన్నిరంబునవహించె మహేశ్వరుఁడంచు మగర్వభా।
సితగతిమిన్నుముట్టెడు శశీ మతినిన్నరకాలఁదన్నిను।
న్నతఁడెకదా కళాగతివటంబు దయన్విడ చెన్నతావమా।
నతఁగని, సిగ్గుఁజెందవు మనంబున నీకుఁబరాకువచ్చెనే॥ ౬౩॥

కం॥ తొలిలోకములకువంకరఁ। గలిగింతువటంచు నెంచి, కమలభవుఁడు ని
న్నిలఁబుట్టినపుడె వంకరగలవానింగఁ జేసెఁగాదె కమలవిరోధీ॥ ౬౪॥

సీ॥ ఇందిరావిభుఁడాత్మహృదయస్థితుని నిన్ను దోషాకరుఁడవంచుఁ దొలఁగఁజేసె।
నతఁడు ధాతయు స్వకీయాబ్జపీఠికిఁ జేటొదవునంచు నత్రినేత్రమున నునిచె।
నందుండి తారాపహరణవైఖరిఁ జూపనతఁడు పాథోరాశియందు వైచె।
నచట రాజీవసంహరణంబుఁ గావింతువనియబ్ధి యంబరంబునకుఁ ద్రోచె॥
తే॥ గీ॥ నచట రాహువు మ్రింగియు నఱుగకునికి। మఱలఁ గ్రక్కంగ నీరీతి మసలి జగతి।
నందఱికిఁ గంటకుఁడవౌచు నిందనొందు। నీకు నిలకడ గలుగునే నీరజారి॥ ౬౫॥

ఉ॥ ఇంతటివాని నిన్నుఁ దమహృత్పథమందుఁ దలన్ భరించు శ్రీ।
కాంతునకుం గిరీశునకుఁ గానన దావహలాహలానలా।
నంతనితాంతకీలములనానుట లెంతటివింత యామినీ।
కాంతతలంపదద్వయముఁ గాంచునె ధాత్రిభవత్సమాశ్రితన్॥ ౬౬॥

వ॥ అనిపలికి తలఁకువిరిములుకులు చిలుకు వలఱేనినుద్దేశించి॥ ౬౭॥

కం॥ కమలాక్షునికొమరుఁడవై।సుమనోధర్మంబుఁబూనుచుఁబ్రవర్తిలియున్।
కమలాక్షులనేచెదవో।మమతమధువ్రతగుణంబుమానవుమదనా॥ ౧౮॥

తే॥ గీ॥ తొలుతఁగుజనులనలరించుచెలినిఁబనిచి।బలమునడవులనిడియించిపాంథజనుల।
మానధనములఁగొంచుదుర్మార్గనియతి।నలగుశంబరఘాతివీవజ్రబాణ॥ ౧౯॥

కం॥ యుగవిగమజగక్షయపం।బగుశర్వునికంటిమంటనంటికెడసియు।
న్మగుడఁబ్రతికితివీవ।ధ్వగజనదురితమునఁగాదెవారిచరాంకా॥ ౨౦॥

ఉ॥ శంబరదానవుండునినుఁజౌర్యమునంగొనిపోయివార్థిలోఁ
నంబడఁద్రోయనందొకఘనంబగుమీనముమ్రింగదానిగ।
ర్భంబుననప్డుజీర్ణతనుఁబాటిలినన్విరహిప్రజంబులో।
కంబునదావవహ్నినిటుగ్రాఁగికృశించునెయోమధుప్రియా॥ ౨౧॥

వ॥ అనిపలికిచెంగటజ్జెంగలువల పుప్పొడులుజిమ్ముకమ్మతెమ్మెరపైనలిగి॥ ౨౨॥

కం॥ జగమునకున్ బ్రాణంబని। పొగడుదురందఱునునిన్నుభువిలోహృదయా।
శుగమగుటయెఱుఁగరిఁకనీ।దగునడవడియేమిచెప్పనగునుసమీరా॥ ౨౩॥

కం॥ ఘనతరులకుఫలభంగం।బొనరించుటఁజనించునఘపాపములె।
ల్లనుఁగాలభుజగరూపము।లనునినుఁగబళించుఁజంచలగుణాపవనా॥ ౨౪॥

చం॥ అనిహరిణాంకజీవనచరాంకసమీరులదూఱివారిజా।
ననమణిమందిరాంతరమునన్విరిపాన్పుపయిన్విరాలిసో।
లినఁగడుజాలినెచ్చెలులులెమ్మిదెదెత్తుమురాజనందను।
న్ననివిసియంచునూడిలఁబల్కఁగనంతఁబ్రభాతమౌటయున్॥ ౨౫॥

సీ॥ కాలజ్ఞతనురథాంగములకురవిరాకఁదెలిపెనాగ్రకవాకులెలమిమ్రోసెఁ।
దనరాకనినుఁడుపద్మినికిఁజెప్పఁగబంపుశుభదూతయనవేగుఁజుక్కవొడిచెఁ।
దపనుండుదమసంపదలుఁగొనునననుభీతిననదీపికలువెల్లనైవడంకె।
వరుణరతిత్రుటద్వారుణీస్తనహీరమండనంబనసుధాంశుండుగ్రుంకె॥
తే॥ గీ॥ త్వరనరుగుదెంచుకమలబాంధవునిమేటి।తేరుమీదనుగనుపట్టుతెల్లపట్టు।
పెక్కియపుఁజాయయనఁగఁబెంపెక్కెప్రాచి।నల్లనల్లనఁదొలివెల్లతెల్లమయ్యె॥ ౨౬॥

చం॥ ఉదయనగాగ్రవేదిపయినుజ్జ్వలకల్యవరుండుసంభ్రమం।
బొదవద్విజాగ్రణుల్ శ్రుతిహితోక్తిశుభస్వనములెచ్చెలంగఁ బ్రా।
క్పదమలకన్యకంకమునఁగట్టినరత్నసువర్ణసంపదా।
స్పదమగుతాళిబొట్టనఁగభాస్కరబింబముతోఁచెఁదూర్పునన్॥ ౨౭॥

తే॥ గీ॥ ప్రియునితోఁగూర్మికేళెల్లఁగ్రీడసల్పి।యలసినిద్రించెఁగుముదినులనఁగమొగిచెఁ।
దొగలినకరాళిగిలిగింతఁదగిలిపద్మి।నీతతులునవ్వెననవిచ్చెనీరజములు॥ ౨౮॥

కం॥ మక్కువలరనక్కననిడి। అక్కలతోఁగౌఁగలించుతేనికిముద్దు।
ల్గ్రక్కనఁదనముక్కననిడి।జక్కవకవఁగూడెనొక్కజలజపుటెంకిన్॥ ౨౯॥

చం॥ ఒకపొలయల్కచేఁగలయనొల్లకపంతములాడిగుట్టుపు।
చ్చకతరితీపుచూపులనెజాగొనరించుమవెన్కఁగూడికూ।
రుకుఁగనినట్టిదంపతులరూఢిగమేల్కొలుపందలంచెనా।
శుకపికశారికల్వలుకఁజొచ్చెగృహాంతరపంజరంబులన్॥ ౩౦॥

ఉ॥ రాతిరిచంద్రకాంతితిమిరంబులగీటడగింపఁదచ్ఛిశు।
వ్రాతములబ్జకోశవివరంబులడాగిభయాప్తినాత్మరూ।
పాతిశయంబుమానియితరాకృతిఁగైకొనెనోయనన్సరో।
జాతరజఃపిశంగతనుసంగతిఁబొల్చెమెలంగెభృంగముల్॥ ౩౧॥

సీ॥ ఈరీతినిజవిభాపూరితాఖిలదిశామండలుండగుచుభానుండుదోఁప।
నపుడువీణాధరీవ్యాప్తమంగళగీతరాజిమేల్కనిముఖ్యవ్రజవిభుండు।
తత్సమయార్హకృత్యములునిర్వర్తించిరమణీయమణిమందిరముననుండ।
దివ్యదృష్టినెఱింగిదేవసమానుండుగాలవుండుమృకండకణ్వముఖ్య॥
తే॥ గీ॥ మునులతోనటకరుదేరజనవిభుండు।సముచితవిధానములవారిసత్కరించి।
కన్యనడుగంగఁబురజైత్రుకడకుఁబనుప।వారలరిగిరితత్సభావాసమునకు॥ ౩౨॥

వ॥ ఇట్లువిచ్చేసినమునిపుంగవులను॥ ౩౩।

మ॥ కనిగంధర్వవిభుండువారికినమస్కారాదికృత్యంబులిం।
పునఁగావింపుచుదీవనల్వడసిమత్పుణ్యంబునేఁడొతపో।
ధనులారా!ఫలియించెసర్వమునుభద్రింబయ్యెమీరిందువ।
చ్చినకార్యంబెఱిఁగింపుఁడేసఫలతన్ జెందింతుశీఘ్రంబుగన్॥ ౩౪॥

చం॥ అనినమునీంద్రులిట్లనిరనర్ఘగుణోజ్జ్వలుఁడచ్యుతాంశసం।
జనితుఁడుసర్వలోకనుతశౌర్యయశోబలరూపసత్కళా।
ఘనుఁడుమఖవ్రజప్రభుఁడుగానభవత్తనయాలలామకు।
య్యనఘునకిచ్చికీర్తిఁగనుమయ్యధరస్ఫురజిత్సమాహ్వయా॥ ౫౫॥

వ॥ అనినగ్గంధర్వవల్లభుండునిజాత్మజాంతరంగంబుకలవాణివలననంతకుమున్న యెఱింగినవాఁడుగావున॥ ౫౬॥

చం॥ అటులొనరింతునేననతఁడాస్త నుమున్మనుతెల్పఁబల్కన।
చ్చటఁగలవాణితచ్ఛుభవచస్థితిఁదా వినియేగితల్లిఁబం।
గటనలరారుకన్నియకుఁగ్రన్ననఁదెల్పఁగనవ్వెలందివి।
స్ఫుటరమదాల్చెమోదరసపూరితభూరితరాంతరంగయై॥ ౫౭॥

మ॥ మునివర్యుల్శుభలగ్నముద్దెలుపసమ్మోదంబుతోనప్పుడ।
జ్జననాథోత్తముతండ్రిపాలికినభస్సంచారిజంఘాలునిన్।
ఘనలీలన్శుభరేఖయిచ్చిపనిచెన్గంధర్వనాథుండు, వే।
చనిశత్రుంజయుఁగాంచివాఁడుదెలిపెన్సమ్యక్శుభోదంతమున్॥ ౫౮॥

ఉ॥ ఆనరనాయకుండువినిహర్షమహాంబుధిఁదేలినందనుం।
డైనమఖవ్రజాధిపుసమగ్రశుభంబునకైచనన్బ్రితి।
స్థానపురంబువెల్వడెభటద్విరదాశ్వరథాతిసాంద్రసే।
నానివహాప్తబాంధవజనద్విజమంత్రిసుహృత్సమేతుఁడై॥ ౫౯॥

కం॥ ఈరీతివెడలిశైలమహారణ్యాధ్వములుఁగడచియల్లననాథా।
తీరమణుఁడుగంధర్వపురీరంగమునందునున్ననిజసుతుఁగనియెన్॥ ౬౦॥

వ॥ కనుంగొనిశత్రుంజయుండుదనకునమస్కరించునందనుంగవుంగలించి శిరంబు మూర్కొని సంతోషితస్వాంతుండై నిజపరివారంబునయ్యారామంబునంబటకుటీరము లందువిడియించియుండె నంత నక్కడనప్పురజైతృండంతఃపురంబును బురంబునలంకరించుటకు ఖచరకంచుకీజనంబులనియోగించి కుబేరాదిబంధువులరావించుటకుఁబ్రధానులఁ బంచెనంత॥ ౬౧॥

సీ॥ అపరంజినీటనూత్నపుఁజాయఁదీర్చిరికోటకొమ్మలహర్మ్యకూటములను,
కనకనిర్మితపతాకలునిల్పిరున్నతప్రాసాదగోపురోపరితటులను।
గలయఁబన్నీటిచేఁగలయంపిఁజల్లిరిరాజమార్గాంగణరంగములను।
కస్తూరికాగరుకర్దమద్రవములనలికిరికేళికానిలయములను।
తే॥గీ॥ నెల్లెడలముత్తియఁపుముగ్గులుల్లసిల్లఁ। గదళికాక్రముకస్తంభకలితనలద।
కాయమానహరిన్మణీఖచితతోరణములుపన్నిరిద్వారభాగములగముల॥ ౯౭॥

లయగ్రాహి॥ లీలగ్రాలలక్ష్మీగలమాలికలనెన్నఁదగుపాలికలఁగ్రాలుమణిడోలికలఁదీవన్।
వాలికలమొత్తములకేలికలనొప్పుబాలికలవృగ్గలజపాలికలరేవన్।
మేలగుకపోతకులపాలికలవ్రాలినమరాళికలఁబొల్చుఘనశాలికలవన్నెన్।
కేళికలనాంచితమదాళికచలాడువచనాళికలనాదములప్రోలికఁజమించెన్॥

వ॥ ఆసమయంబున వివిధవిచిత్రవిమానవితానంబులతో నిందీవరాక్షప్రియంవద చిత్రసేన జీమూతవాహనాది గంధర్వులును నలకూబర వరాహకర్ణ గజకర్ణ సుకేతు మణిభద్ర ప్రభృతియక్షులును చైత్రప్రముఖగుహ్యకులునుమందారముఖ్యవిద్యాధరులును నేగుదేర వారలందోడ్కొని యస్వరక్షేత్రుండు శత్రుంజయమహారాజన్యకడకరిగి సవినయప్రియసంభాషణాలింగనాదులనతని నాదరించి తత్పరిజనంబునుఁ దగినవిడిదులవిడియించి మగిడి యాస్థానంబున కేతెంచి పెండ్లికొడుకున్నావింపుటకుఁబంచిన దివ్యాంగనలుమంగళగీతంబులతో శోభనాక్షతంబులునృపాలుఫాలతలంబుననునిచిరంత॥ ౯౮॥

ఉ॥ సంపఁగినూనెనంటిపెలుచన్నసపూనఁగనల్గువటిమే।
లైంపులనత్తుసొంపుదులకింపఁబునుంగుజనుంగవంగుబా।
ళింపమెఱుంగుముంగురులులేఁజెమటన్నదనైనటింపనై।
లింపవధూటియొక్కతెసలీలగతిన్జగతీశుమాళికన్॥ ౯౯॥

కం॥ అలకములువిప్పిగంధా। మలకంబిడిచెలులుసంకుమపుమెఱుఁగుతోఁ।
దెలిగొజ్జఁగిపన్నీట। న్జలకములాడించిరెలమిజనవరతనయున్॥ ౧౦౦॥

సీ॥ వలిపెమణుంగుచేఁజెలియొర్తుదడియొత్తఁసనదుకూలములొర్తుగట్టనొసఁగె।
కస్తూరితిలకమొక్కతెదిద్దనొకతెసాంకవపటీరాగరుకలపమలఁదె।
మాళిపైనొక్కతెమకుటంబుసంధింపనొకతెముత్తియఁపుబాసికముఁగూర్చె।
నొకతెకేయూరహారకలాపములుపూన్పనొక్కతెకట్టాణియొంటులునిచె॥

తే॥ గీ॥ నతివయొక్కతె కల్వమాల్యంబు వైవ। నొకతె కంకణరత్నముద్రికలు దొడిగె।
నఖిలభూషణభూషితుఁడగుచు భూవ। గుండు రంజిల్లెఁ బూర్ణచంద్రుండు వోలె। ౯౭॥

మ॥ గంధర్వేంద్రనియుక్తులై కదిసె లగ్నంబంచు మంత్రుల్దొరల్।
గంధేభాశ్వశతాంగభూరిభటరంగజ్జైత్రవాదిత్రధా।
రంధర్యాన్వితులౌచు వచ్చి యమరేంద్రప్రేషితాభ్రద్విప।
స్కంధారూఢునిఁ జేసి రుత్సవముతో క్ష్మామండలాఖండలున్॥ ౯౮॥

మ॥ త్వరతో నత్తఱిఁ బౌరవారవనితావారంబు పౌరప్రహ।
ర్షరసంబుప్పతిలన్నృపాంగణమణీసౌధంబులన్నిల్చి భా॥
స్వరలీలన్ జతురంగసేనగొలువన్ దన్తీంద్రపై వజ్రభం।
ఘురఘుంటాపథసీమ భూమివరసూనున్ గాన్చె నంచద్గతిన్॥ ౯౯॥

చం॥ బలువలపూరఁ జెందిరికపావడపైసరిగంచుచీర కెం।
దళుకులు దేరఁ బెన్నెరులతావికిఁ దేటులు చేరఁ గొల్పుల।
న్గళుకులు మీఱఁ దారకడకంటికిఁ దారదృగంశుపాళిక।
ల్వలజిగి తీరుగేర నొకవారవిలాసిని చూచె నవ్విభున్॥ ౧౦౦॥

చం॥ పగడఁపు మోవితోఁ జిలుఁగుపయ్యెదతోఁ దమిఁ గొల్పు బొల్పుతో।
నిగనిగమించు శిబ్బెములనిగ్గులతోఁ దగుగుబ్బదోయితో।
సొగసగు వేణితో బెళుకుచూపులతో లలి లేతనవ్వుతో।
జిగివగఁగుల్క వచ్చి యొకచేడియ చూచె ధరాపురందరున్॥ ౧౦౧॥

చం॥ సురుచిరగల్లభాగముల శోభలు గమ్మలనుల్లసిల్లఁ దా।
మరనిరసించు నెమ్మొగము మందరుచుల్ వెదచల్లఁగం చెల।
న్గురుతరమై బిగిన్వెడలు గుబ్బజగా జిగిగుబ్బటిల్లవే।
మరునిలు చెమ్మగిల్ల నొకమానిని గాంచె ధరావరోత్తమున్॥ ౧౦౨॥

ఉ॥ బాలిక యోర్తు వేగఁ జని, బంగరుమేడను నిల్చి వేడ్క భూ।
పాలతనూజుఁ జూచు నెడఁ బయ్యెద యూర్పుల గాలి దూలినన్।
గేలనమర్చ్చచో దమి నొగిన్వడి నీవియుఁ జారభర్మపాం।
చాలిక చాటుఁ జేరెఁ గరసంగ్రథితాంశుకయై త్రపాగతిన్॥ ౧౦౩॥

సీ॥ హీరభూషణధాత్రయై రాచిలుకఁ గేలఁ గొని జూచె నజరాణి యనఁగ నొకతె।
కనె మోహవివశయై కదలక మేడ యంచున నిల్చె మణిపుత్రి యనఁగ నొకతె।
హరినీలమంచకోపరి నుండి వీక్షించె ఘనము పై మించుమించనఁగ నొకతె।
పగడంపుగొణిక దాపుగ హత్తి చూచెను ఘటితకాంచనవల్లిక యన నొకతె॥

గీ॥ వ్యత్యయధృతాభరణలీలయగుచుసంభ్ర। మాంచితరయానుగతివచ్చి కాంచెనొకతె।
భువనమోహనమంగళస్ఫురితరూప। వైభవోదారునమ్మహీవరకుమారు॥ ౧౦౪॥

వ॥ ఇత్తెఱంగున ముదాయత్తంబులగుచిత్తంబులనలరు నత్తామరసనయనల తరళా విరళధవళధవళేతరదృక్ప్రసారంబులకనుసారంబులై క్షైరవేందీవరతోరణంబులుద్దామ చామరసమీరవారంబులంజలింప నిలింప కింపురుష చంపకగంధుల చికురబంధగంధంబులకు వెఱచి గంధసింధురకుంభంబులఁ వ్రాలు బంభరంబులరొదలంబొదవు నారట్టజఘాట్టాణఘోటకగళాటకహాటకకటకకింకిణీగణనటీకంకణమణిమంజుమంజీర శింజితంబుల దిదృక్షుజనవచనకోలాహలంబులనుగ్రిందుపరచి క్రందుకొను సురదుందుభి డమామికా కాహళ మృదంగ పుంఖానుపుంఖశంఖవేణువీణాదివాదన నినాదంబులురోదసినిండ నిండారవిరిసినపుండరీకమండలంబు గండడంచు పాండురపుండరీకంబులమెండుమీఱిన ముత్తెంపుజల్లులజిగివెల్లువలఁగల్లుకొను వెల్లపట్టుసిడంబులనడుమఁబగడంబుడంబువిడంబించు దట్టంపుకెంపుటాలవట్టంబుల కట్టెనిగ్గులకునిట్టలంబుగఁజుట్టంబులై నట్టువ వెలుల యంగదట్టంబులమీదిపుట్టంబులంగప్పి యుప్పరంబెగయుసారకేయూరమకుటఘట్టన రత్నరజంబులు మెఱయ వఱపలుగఁదొరఁగు డిండిమవాదనోత్పాదితవేదండగండమదజ లంబులఁబంకిలంబగునేలంగాలూనకసమ్మర్దంబునంద్రోపాడఁ గ్రిక్కిఱిసియెగయుపొడుల విలాసంబుగనప్పట్టఁ బట్టపగలుగాఁజంద్రజ్యోత్స్నలుఁ వెలుంగ నభంగశృంగారరసతరంగంబులతెఱంగునఁగురంగధరమరీచిసధ్రీచీసదృచిరంబై చీనిచీనాంబరకరీటాంగదహార హీరచాకచక్యంబుచెన్నొంచమందగమనంబునందగుచతుర్దంతదంతావళంబుపైనింద్రుండు నుంబోలె నృపనందనుండురాజభవనాంగణంబుచేరవచ్చెనంతనక్కడ। ౧౦౫॥

కం॥ సుందరులప్పుడుబంగరు। బిందెలపాటీరసలిలపృథుధారలన।
య్యిందుముఖిజలకమార్చిర। హిందడియొత్తిరినితాంతమృదుచేలములన్॥ ౧౦౬॥

చం॥ కలితదుకూలమింపలరఁగట్టిలలిందిలకంబుదిద్దిక।
జ్జలమిడిపారిజాతసుమసంఘముఁలుగ్గలఁబుఁగూర్చిస।
ల్లలితమణిస్ఫుటాఖిలకలాపకలాపములన్ఘటించికాం।
తలపుడు దెచ్చిరవ్వికచతామరసాక్షివివాహవేదికిన్॥ ౧౦౭॥

కం॥ ఇటభవనద్వారముమం। దటకున్వచ్చునృపతనయునకునెదురుగనం।
తటవసుమంతుఁడుసనిచెం। గటఁగరి డిగ్గ్రిమొక్కినతనిఁగనిదీవించెన్॥ ౧౦౮॥

వ॥ దేవర్షిభూదేవమంగళాశీర్వాదనాదంబులును బృందారకవందిమాగధుల్కైవారంబులును వేల్పుగాణియల లక్ష్మీనారాయణకళ్యాణంపుఁబాటలసన్నంపుటెలుంగులును భూనభోంతరంబునిండ నభ్యంతరనిశాంతంబునకు సామంతహితమంత్రిసహితంబుగాఁ దోడ్కొనియేగుతతినృపనందనుండంచంద పుణ్యాంగనాజనమణిభాజననీరాజనోపచారం

బులాదరింపుచుఁ గక్ష్యాంతరద్వారపార్శ్వనిక్షిప్తమంగళకలశముకురాదిభద్రపదార్థంబుల నీక్షించుచు మనువయభానుండను గంధర్వప్రధానుండొసంగు నీఁగిరిమానిపువ్వు లక్కైదండఁ గొనుచు నల్లనల్లన నడచి గారుత్మతతోరణవిరాజితవిద్రుమస్తంభసంభారబింబితరంభాదిదివిజరంభోరుకలకలకరంభితకళ్యాణక్రియారంభంబును సైరంధ్రీకరధృతకస్తూరికాది నిస్తుల పరిమళవస్తుఘుమఘుమాయమాన కనకపాత్రంబును బురోహితబ్రాహ్మణబంధుపురంధ్రీబృందనీరంధ్రంబును నగు వైవాహికమందిరంబు నడుమ నడరు మరకతమణివేదికోపరికురువిందచరణాంచిత కాంచనపీఠంబున నధివసించె నప్పుడు॥ ౧౦౯॥

కం॥ ఆగమవిధిసహితముగా। నా గంధర్వపతియొసఁగె నవనీపతికిన్।
దోర్యోగోపధిమధుగుడసుప। మాగుంభితమై చెలంగు మధుపర్కంబున్॥ ౧౧౦॥

కం॥ కలుములచెలి కెనయగుము। ద్దులకూఁతు న్దానుపనముతో య్యాలియుఁ ధరా।
తలనాథతనయుహరిగతిఁ। బోలుపునర్చించి ధారవోసిరి యెలమిన్॥ ౧౧౧॥

వ॥ ఇవ్విధంబున వైవాహికమంగళంబాచరించి గంధర్వవల్లభదత్తంబగు నుపాయనంబులతోఁ గన్యారత్నంబును దోడ్కొని నిజపరివారంబుతో మఖవ్రజాధినాథుండు నిజపురంబుఁ బ్రవేశించి యభ్యంతరమందిరంబుఁ జేరిన నచ్చటిసుందరీబృందంబు మందానందంబున॥ ౧౧౨॥

ఉ॥ అంతఁ గళావతీసతి నిహాళి నికేళిగృహంబు చెంతన।
భ్యంతరమందిరంబున సుఖావహశోభనకార్యపద్ధతి।
న్సంతసమొప్పఁ జల్పునటుఁ జయ్యన మాయమఖవ్రజుండు దా।
నెంతొ ముదంబుఁ జెంది వసనింతిని గాఁగిటఁ జేర్చెఁ బేర్మితోన్॥ ౧౧౩॥

ఉ॥ తోడనె యమ్మఖవ్రజుఁడు తొయ్యలి నొయ్యన శయ్యపైఁ దగ।
న్గూడఁగఁ జేర్చి బల్మినుపగూహన మొప్పఁగఁ జేసి చెక్కుల।
న్వోడిమి మీఱ ముద్దులిడి పొల్పరదచ్ఛదమాని మానిని।
న్గూడి సుఖాప్తి నాత్మరతిఁ గొల్లఁగఁ దేలె విలాసవైఖరిన్॥ ౧౧౪॥

ఉ॥ ఒండొరుకోర్కె లిమ్ముగ మహోత్కటమై విలసిల్ల రాగము।
ల్మెండగుచుండ బల్మి మెయి మేకొని బంధగతుల్ప్రగాఢమై।
యొండొరు మీఱ భూరిరతులొప్పఁగ సల్పిరి ముక్తకామిని।
న్దండిగఁ గూడు యోగిగతి ధన్యత నాత్మసుఖంబుఁ దేలుచున్॥ ౧౧౫॥

వ॥ ఇట్లమ్మఖవ్రజనాథుండు నిరంతరసుఖానురాగంబుల భోగంబులు గాంచుచు నక్కళావతీసతీతిలకంబుతో సుఖంబుండె॥ ౧౧౬॥

కం॥ అనిమార్కండేయమహా। మునిక్రోష్టికిఁ జెప్పినట్లు ముదమునఁ బక్షు।
ల్వినిపించిన నపుడా జై। మిని సంతసమంది పేర్మి మెయి సుఖముండెన్॥ ౧౧౭॥

శా॥ ఆశాపాశవినాశభాసురదయాహాస్యః ఫురద్వ్యాకనః।
దేవేశాయీశదిగీశవంద్యవరనిర్వేశామహేశాసువీ।
కాశాసీనమునీశమానసలసత్కైవల్యరూపైకచి
త్కోశాశుభ్రశరీరపన్నగధరాకూటస్థసర్వేశ్వరా॥ ౧౧౭

కం॥ శ్రీపతివాక్పతినుతపర।మాపోజ్యోతిస్స్వరూపయపవర్గమయా।
పాపౌఘనాశశంకర।కాపథజనదూరధీరగౌరీరమణా॥ ౧౧౮॥

కవిరాజవిరాజితం॥ వినమితమానివరావనపావనవిశ్వకృతప్రవిచక్షణధీ।
మనసిజసంహరమర్దితగహ్వరమంగళకారణమాననిధీ।
ఘృణిశశిసూర్యవిలోకనశ్రీకరగృధ్నసుపూరణసర్వసుధీ।
జనవరవందితశాశ్వతభాస్వరసన్మయచిన్మయబోధనిధీ॥ ౧౨౦॥

మాలిని॥ కవిజనపరిపోషా-కావ్యవిద్యాజిగీషా।దివిజమథనరోషా-దివ్యభవ్యప్రభూషా।
సువినయపరిభాషా-శోభితానందవేషా।ప్రవిమలహతదోషా-భక్తచిత్తప్రజోషా॥

గద్య.

ఇది శ్రీమదిమ్మానేన్యన్వయపయఃపారావారరాకాసుధాకరానవరతదేవబ్రాహ్మ
ణపూజావిధేయదిగంతరాక్రాంతయశఃపరిపూరితశ్రీబాపనార్యపౌత్రవీరే
శలింగనాయకపుత్ర శ్రీమద్గౌరీరమణచరణారవిందామందమకరంద
పానతుందిలేందిందిరాయమాణశ్రీదక్షిణామూర్తిరామజోగి
గురుప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషాచతు
రకవితావితానానూనవైభవబుధజనవిరాజ
మానశరభలింగాభిధానప్రణీతంబైన
యలంకారచంద్రోదయంబను
మహాప్రబంధంబునందు
సర్వంబును
చతుర్థాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

